# పీఠిక

## కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ.

నేటి తెలంగాణాలో చక్కని భాషాజ్ఞానము గలిగి గొప్ప త్రోవలో కవితా సంచారము చేయు కొద్దిమందిలో శ్రీ పల్లా దుర్గయ్యగా రొకరు. వీరికి రాదగినంత పేరును రాలేదు. దీనికి కారణము దుర్గయ్యగారి ప్రకృతి. అది యొదిగి యొదిగి యుండునది గాని విడంబముకలది గాదు. వీరేది వ్రాసినను నిర్దుష్టమైన భాషలో వ్రాసెదరు. కవిత్వములో పలుమార్గములు పోగలిగిన శక్తిశాలి. అర్థవంతముగా శబ్దమును ప్రయోగించగల శక్తి కలవాడు.

ఈ కవియందు భాషాజ్ఞాన మెంత చిక్కగానున్నదో పేదల దుర్దశనుగూర్చిన మనోబాధయు నంత చిక్కగా నున్నది. పేద జీవితమునందు జాలిగలదు. కాని ఆధునికులలో పలుమందివలె విచార రహితముగ తొందఱపడు లక్షణము లేదు. లోకమంతయు మారిపోవుచున్న దన్న నినాద మీనాటి ప్రభాత గీతము. ఆ మార్పుయొక్క స్వరూపము దుర్గయ్యగా రిట్లు చెప్పుచున్నారు:

> "మారుపు మారుపంచు పలుమారులు పేరులు మార్చిమార్చి ఏ
> మారిచి పిల్చు మాత్రమున మారుపువచ్చునె తత్వమందు ? గో
> మారును పేరుమార్చి సుకుమారి కుమారి యటంచు ముద్దుగా
> కోరికమీఱ పిల్చినను గోవుల నెత్తురు పీల్చకుండునా ? "

ఈ వ్యాఖ్యానము రాజకీయ సిద్ధాంతముల మీద వలె నున్నది. ఇది యెంత నిజ మనిపించు చున్నది! పేరులు మార్చుటయే కాని వచ్చెడి విశేషము లేదని చక్కగా తెలిసిన విప్లవకారుడు దుర్గయ్యగారు. అందు చేత నీయన విప్లవము తన కవిత్వమునందే కలదు. ఆచరణలోనికి వచ్చుట

లేదు. ఇట్టి విప్లవ మాచరణలోని కెట్లు వచ్చును? అజ్ఞులను ప్రతారించు త్రోవలో విప్లవములు చెలరేగును. విజ్ఞతాగుణ భూయిష్ఠమైనది విప్లవముగా నంగీకరింపనే బడదు. ఈయనకు కర్షకుని మీద నున్నంత జాలి మరియొక విప్లవకారునకు గలదా యని! కాని నిర్దుష్టమైన దేశీయమైన — పలుకుబడి చేత ఈయన విప్లవము విప్లవముగా కనిపించుటలేదు. విప్లవము విశృంఖలత్వము కాదనుట కీయన కవిత యుదాహరణము.

ఈ గ్రంథ మొక విలక్షణమైన గ్రంథము. ఇందు పలు విషయముల గురించి వ్రాయబడినవి. విషయములు బహుభిన్నములు. వస్తువునందలి భిన్నత యట్లుండగా ఈయన కవితా భావనయందు మిక్కిలి భిన్నత కలదు. ఒక్కచోట వాచ్యము - మరియొక విషయము వ్యంగ్యము - మరియొకటి వ్యాజోక్తి - ఇంకొకటి యాత్మీయమైన రచన - వేరొకటి వేదాంతము — మరియు నొకటి త్రోడి విప్లవకారుల మార్గమును మందముగా పరిహసించుట. ఈ కావ్యము చిత్ర చిత్రములైన భావనా లక్షణములు కలిగిన కావ్యసంపుటి.

ఇది రెండు భాగములు, మొదటిది పద్యావళి - రెండవది గీతావళి. గీతావళిలో చివరిది "మామ". అది పసిపిల్లల కొఱకు వ్రాసినది. ఈ గీతావళిలో "వస్తున్నాం" అన్న శీర్షికతో నొక పెద్ద పాట యున్నది. తాగూరు ఊర్వశిని గురించి యొక గీతము వ్రాసెను. అది వ్యాఖ్యాన బాహుళ్యము చేత మహా కావ్యముగా చెప్పబడుచున్నది. ఆ పద్ధతిలో మానవుడు, యువతి మొదలైన శీర్షికలు పెట్టి పలుమంది యాధునికులు చిత్ర చిత్రములుగా వ్రాసినారు. లోకములోనున్న బహు విషయములు గ్రుచ్చి యెత్తుట, ఆ గీతముల యొక్క ప్రధాన లక్షణము. ఈ "వస్తున్నాం" ఆ రకమైన ఎత్తుగడ కలది. కాని చాల విలక్షణమైనది. ఆధునికుని యొక్క లక్షణమును పరమ మధురముగా చిత్రించు చున్నది. ఈ యువకుడు విద్యార్థి, ఈవృత్తిలో నాయకుడు, అతని నియమ రహితత్వము, అతని పత్రికా

పఠనమాత్ర పర్యవసాయియైన విజ్ఞానము, అతని అహంకారము, అతని ఆడంబరము, వ్యర్థత్వము, సేవకోసము బ్రతుకుచున్నానని అతడు చేసెడి నినాదము, అతని వ్యర్థోపన్యాస పాటవము, అతనికున్న సర్వలక్షణములు అతడే చెప్పకొనుచున్నాడు. ఈ గీతము చదివిన మనకు నవ్వువచ్చును గాని కోపమురాదు. మన మటువంటి వారమే. ఆ గీతము మన మీదనే వ్రాసినాడు కవి. మనను తిట్టినాడు కవి. మనలను తిట్టినట్లు మనలకు తెలియదు. మనలను గుఱించి యథార్థముగా వ్రాసినాడు. ఆ కవి కూడ మనలోని వాడే. మనవంటివాడే. అతడు నిటువంటివాడే. అందఱము కలిసి నవ్వుకొను చున్నాము. ఇంత యందమైన రచన యాధునిక కావ్య ప్రపంచములో లేదు. పైన చెప్పిన లక్షణములతో కూడుకొని యుంటయే దీని లక్షణము. ఇట్లు వ్రాయుట యదియొక ప్రతిభ. ఇట్టి కావ్య మాంగ్ల భాషలో ప్రకటితమైనచో అతనిని మరునాడు కొండ కెత్తుదురు. ఎక్కువ భాగము ఎండిపోయిన సంప్రదాయము చేతనే కట్టుబడి యుండుచున్న భావములే విప్లవ మనుకొనుచున్న యీ దేశాన ఇంత యొడుపుగల రచనలోని సొగసు వెంటనే గ్రహించుట కష్టమేమో! ఏ రచనయైనను పద్యములలో లేనిచో కొందఱికి పరిగ్రాహ్యమే కాదు. మరికొందఱకు పాటలో లేనిచో పరిగ్రాహ్యము కాదు. అందుచే నింత గొప్ప రచన పాటలోనుండియున్న హేతుపున నొరవంక, మంటలు లేని హేతువున నొకవంక, దాని రమణీయత నందిచ్చుటలేదు.

మతములను గూర్చి యీయన యొక పర్ణవ్యత్యయముతో చిన్ని చమత్కారము చేసినాడు.

> "మనసు చీకటిచేయు
> మతము లవి తమము లగు."

మతము, తమము _ అక్షర గత చమత్కారము.

"*ఏమి?*" యను గీత మిందొక టున్నది. ఇందులోని వస్తువు సులభ గోచరము కాదు. ఈ రీతిగా నర్థముకాని కొన్ని కావ్యములు కడచిన రెండు మూడు దశాబ్దులలో వెడలినవి. వానికెదో మర్మ కవిత్వమని పేరు పెట్టినారు. దీని యందలి విషయ మెవ్వరికిని తెలియదు. ఏది చెప్పినను చెప్పవచ్చును. కాదనుటకు వీలులేదు. ఈ కావ్యములో బహు కవితా మార్గము లున్నవంటిని కదా! ఇది మర్మకవిత యుదాహరణము.

ఈ గీతావళిలో "వర్షాబ్ధి" యను శీర్షికతో నొక గీతమున్నది. ఈ గీతము వ్యంగ్య ప్రధానమైనది. ధనవంతులను కొల్లగొట్టి పేదవారికి దానముచేయు నొకా నొక దొంగ ఈ వర్షామేఘమువలన సూచింపబడినాడు. కాని చివరకు ఓకిళ్లు పుట్టెనో అన్న శబ్దముచేత కట్టిన బొమ్మ చెరిగి స్త్రీత్వారోపణ జరిగినది.

ఈ గీతావళిలో మొదటి గీతము "సెలయేఱు". ఇది చాల గొప్ప గీతము. భావనారమణీయమైన గీతము. ఆ కొండ సెలయేటిచేత కౌమారావస్థలో నున్నది. తలకు తెల్లరుమాలు చుట్టుకొన్నది. కవియొక్క యూహ రకరకములుగానున్నది. కవి మధురమైన యూహశాలి యనుటకీ కావ్య ముదాహరణము. ఆ సెలయేఱు "మంచు కొలకుల తానమాడి లేచిన దివ్య వారకామిని యార్ద్ర వసనాంచలమని" యున్నదట! మేఘ సందేశములోని యూహలు జ్ఞాపకము వచ్చుచున్నవి. "సానువుల శిఖ రాశితో నేక మొనరించి అనుపోసినరీతి నటునిటుం దిరుగాడి" - అనుపోసినరీతి యనుట కవితాశక్తి.

ఈయన పద్యావళి పలువిధములైన సుశీకారములను, లోకజ్ఞతయు, గడుసు పలుకు బడులయు, పద్య రచనా ప్రౌఢులయు కొటారు. కోడిపుంజును "*నడగడియార*" మనియెను. ఇది క్రొత్తగా సనుట. '*వికృతి సంవత్సరము*' మీద కొన్ని పద్యములు కలవు.

"'తింత్రిణీ వృక్షములు పండి తియ్యనయ్యె" నంట. చింతచెట్టు క్రింద గడ్డలుపెట్టి కొట్టి రాలిన గుల్లలు తినిన రుచి జ్ఞాపకము వచ్చు చున్నది. 'వికృతి' శబ్దమునకు ప్రధానముగా మార్పు అని యర్థము. అందము లేకుండుట యనునది విగ్రహింప బడిన యర్థము. ఈ మూలా ర్థములో నీయన వాడినాడు.

"ప్రకృతి సర్వము వికృతి సంపర్కమంది
పచ్చ పచ్చగ కన్నుల పండువయ్యె"

ఈ రెండు చరణములు సృష్టియొక్క మొదటి లక్షణమును స్మరింప చేయు చున్నవి.

"*దివ్వెల పండుగ*" యన్న శీర్షిక యొక భావుకమైన రచన. దాస్యముచేత క్రుంగుచు తిండికిలేక రేషనుచేత బాధపడుచున్న రోజులలో వచ్చిన దీపావళిని నిందించెడు పద్యములు. అల్లుడు వచ్చినాడు. చిట్టెడు పంచదార దొరకదు. పద్యములు చదువనే వలయును. ఈ దివ్వెలపండుగ-

"మట్టెలు చిట్కు కొట్కు మని మంజుల నాదము లీనుచుండగా
పట్టణ వాసులన్ బలిమి పండుగ జేయుమటంచు"

వచ్చినదట. ఎంత రమ్యముగానున్నది! ఇంక నాల్గునాళ్ళకు దీపావళి వచ్చునసంగా పిల్లలు చిటపటాలు గీయుచుందురు. అది యామె మట్టెల ధ్వని. టపాకాయల కొనకపోయినచో పిల్ల లేడ్తురు. ఇది బలవంతముగా పండుగ చేయించుట.

"మందులు తినుటయే విందయి మనెడి రోజులలో" అది వచ్చి నది. పూర్వమెప్పుడో భగవంతుడు నరకుని సంహరించెనట!

"ఎడనెడ నిప్పుడున్ నరకు లెందఱో యుందురు," వారిమాట ఏమి? యనుచున్నాడు.

"స్మృతి" యన్న శీర్షికలో చివరి పద్యము.

"ప్రాణిమయమైన విపుల విశ్వమ్మునందు
ప్రాణముల నిల్పు నరు డొక వ్యక్తిమీద,
దాని కొఱకయి తన జన్మ ధారవోయు,
అతని కిహమును పరమును నదియ నువ్వె."

ఈ పద్యము కాళిదాసుని వంటివాడు వ్రాయవలెను. దీనికెంత వ్యాఖ్యానము వ్రాసినను చాలదు. ఇది సృష్టి రహస్యము. జీవలక్షణము. వేదధర్మ ప్రతిపాదకము. రసమార్గము. ఇన్ని విధముల దీనికి వ్యాఖ్యానము వ్రాయ వచ్చును. ఒక్కొక్కచోట వ్యంగ్యము భావకవుల మార్గమున కూడ నడచును.

"అడవి దారిని ఒంటిగా నరుగు తఱిని
దూరమున గానుపించె నీ జారు జడలు
హస్త ధృత సుమమాలికనై యటకు జేర
పాయలై త్రాచుపాములు ప్రాకిపోయె."

దీనిని స్థూలముగా చూచినచో భావకవిత్వ మనవచ్చును. సూక్ష్మముగా చూచినచో విప్రలంభ రసమునందలి యున్మాదావస్థను సూచించుచున్నది.

"చెఱలో మొఱ." ఇది గోపన్నగారి విలాపము. ఒక్కొక్కని తెలుగుబాస యొక్కొక్క విధము. గోపన్నగారి తెలుగుబాస యొక విధము. ఆ బాసలోని సొగసంతయు నీ కావ్యములో నున్నది. ఈరీతి నొక మహాభక్తకవియొక్క బాసను స్వాధీనము చేసికొని అదే అన్నట్లు వ్రాయగల్గుట యొక విలక్షణమైన శక్తి.

ఇట్లొక్కొక్క శీర్షికను తీసికొని వ్రాసినచో చాల పెరిగిపోవును.

ఈయన గొప్ప యుక్తి వైచిత్ర్యము గలవాడు. కృష్ణుడు పాటపాడె నట: 'నరకమ్ములు కూడ లయమ్ము పొందిన'వట ! ఇది యాశ్చర్యకరమైన

పలుకుబడి. జ్ఞానముచేత సర్వకర్మయు నశించును. పరమేశ్వర గానము నందలి లీనతచేత నరకమ్ములు లయించును. ఈ భావము యొక్క స్థాయి చూపించితిని. మరియు నొకచోట కవి యిట్లు వాంఛించుచున్నాడు.

"స్వార్థ వాసనాపరులగు వారి చిత్తములు
పాప భయంబును పొందుగాక"

ఇట్లు వ్రాయుటకు ఒకానొక యూహ కావలయును. మానవుని మనః ప్రవృత్తి, తత్ప్రవృత్తి హేతువులు, తద్ధేతు నిరాకరణము, అన్య సంస్కార సమాగమనము, ఏవంభూతమైన పరిణామము బుద్ధికి విశదముగా నున్నప్పుడు గాని యిట్టి వాక్యరచన జరగదు. పైదికమైన యూహగల వానికే యిది సాధ్యము.

"కుబేరు"డన్న శీర్షికలో ఈయన యొక్క విప్లవ కారుని లక్షణము తెలియగలదు.

"తెలుగు తన్ని" యన్న గీతమాలిక యాంధ్ర సరస్వతిని గూర్చిన సంబోధన. ఇందులో కొంత పరిశోధన భాగము, నన్నయకు పూర్వ చరిత్ర. నన్నయ్యగారు భారతభవనము న చింతామణిని నిలిపినాడట. ఇది యుక్తి పై చిత్ర్యము. శ్లేషవాసన కలది. వేష భాషలు రెండు జాతీయతా లక్షణమునకు పాదులు. నేటి తెనుగువారికి వేసము పోయినది. బాస పోయినచో పీసమేనిరాదు. ఇందులో కొంత బాసను నడిపెడితీ రుపదేశింప బడినది.

ఈయన చాల యూహాశాలియని తొలుతనే చెప్పితిని కదా! ఆధునికములైన కొన్ని వ్యర్థములైన భావములను ఈయన నిరాకరించును. "సుమాహరణ" మందులో నొకటి. చెట్టుననుండి పూవులు కోయుటయే తప్పని కొందఱి మతము. వారి కిది సమాధానము.

నీరు కన్నులతో చూచిన తృప్తి; మా కవి కోసి శివపూజ చేయుట యందు తృప్తి; ప్రియురాలి కొప్పులో తురిమినచో తృప్తి; చెట్టునందే

వాడి యెండి పోవలయునా పూవు ? ఆపూవు నీవు కోసినపుడు తల్లియైన మొక్కయే తలయూపు చున్నది.

ఈయన కొన్ని శబ్దములు చమత్కారముగ వాడును. వాని యందలి శ్లేషచేత రమ్యార్థములు పుట్టించును. సీత దుఃఖించుచు "పాడు మృగతృష్ణ నన్నింత పనికి దెచ్చె" నని దుఃఖించెను. పూర్వము చెప్పిన వికృతి, చింతామణి, శబ్దప్రయోగముల వంటిదే యిది. ఎండమావులని యర్థము. లేడియందలి కోరిక యని యవయవార్థము. ఇట్టి ప్రయోగములు కవియొక్క భాషా ప్రభుత్వముతో బాటు భావుకతను పరిశీలనా సామర్థ్యము ను తెలుపును.

ఈయన యిన్ని గుణములతోబాటు లోకోక్తులను సమృద్ధిగా సంతరించును.

"తుంచపు బొజ్జలో తొణక దుండగ"
"పచ్చడాల్ తన్నుచు నిట్టనీలిగి"
"బొట్టులు కాటుకల్ పొడిచి బొమ్మల పెండ్లికి కమ్మలంపిరో"
"కొంగులో జెట్టిని తెచ్చినావు"
"చేయిని·చేయి కల్పి పెటచేతను జేబులు పున్క చేరముల్"

మరియు మధురములైన సంస్కృత సమాసము లెట్లు కూర్చునో, కొన్ని పద్యములలో గమనమెంత విసూత్నముగా నెఱపునో భావుకులకే తెలియును. ఈ గ్రంథమునకు పీఠిక వ్రాయుమని నన్నడిగిన తెలంగాణా రచయితల సంఘాధ్యక్షుడును- యువకవి శిరోభూషణమును అయిన దాశరథికి నే నప్పుపడి యున్నాడను .. ఆయన దయవలన నీ గ్రంథములోని కొన్ని యందములు చూపించుటకు నాకు వీలైనది గనుక.

# కృతజ్ఞతలు

గత దశాబ్దంనుండి తెలంగాణంలో నిశ్శబ్దంగా సాహిత్య వ్యవసాయం చేస్తున్న విద్వత్కవులు శ్రీ దుర్గయ్యగారు. కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలంగాణా రచయితలసంఘం మున్నగు స్థానిక సాహిత్య సంస్థలతో 'పూసలలో దారముమాడ్కి' సన్నిహిత సంబంధము కల్గియున్నా పైకి కన్పించని నిరాడంబరులు వీరు. పద్యాన్ని ఎంత ప్రౌఢంగా నడుపగలరో, గీతాన్ని అంత కమనీయ రీతిలో రచిస్తారు. కవిత్వానికి కావలసిన ప్రతిభా వ్యుత్పత్తులు సమాన ప్రమాణంలో గల దుర్గయ్యగారి కావ్యఖండికలు అటు ప్రాచీనులకు, ఇటు అర్వాచీనులకు ఆనందోల్బణం కల్గిస్తాయి. తెలంగాణా జనపదాల్లో వాడుకలో ఉన్న ఆణిముత్యాలవంటి నానుడులను, పగడాలవంటి పలుకుబళ్ళను సందర్భోచితంగా కూర్చి కావ్య హారానికి సౌందర్యం అందించడంలో దుర్గయ్యగారికి విశిష్టస్థాన మున్నది.

ఇంతవరకు వీరి రచనలు సంపుటిగా వెలువడ లేదు. తమ రచనలు సంపుటీకరించి ప్రచురించడానికి వీరెన్నడు ప్రయత్నం చేయనులేదు. అయితే మిత్రుల ప్రోత్సాహంవల్ల స్థానిక పత్రికల్లో, ప్రత్యూష, ఉదయ ఘంటలు మున్నగు కావ్యసంపుటులలో తమ రచనలు ప్రచురించారు. తొలిసారిగా పుస్తకరూపంలో వీరి కావ్యఖండికలను ప్రచురించే అవకాశం తెలంగాణా రచయితల సంఘానికే దక్కింది. ఇందుకు రచయితల సంఘం ఎంతో గర్విస్తున్నది. పుస్తకప్రచురణకు దయతో అంగీకరించిన దుర్గయ్య గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు. అడిగిన వెంటనే చక్కని పీఠిక వ్రాసిపంపిన కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణగారికి, తగిన సలహాల నిచ్చి సహకరించిన మిత్రులు బి. రామరాజు, దాశరథి గార్లకు, ముఖ చిత్రాన్ని అందించిన బలరామాచార్యులు గారికి కృతజ్ఞతా పూర్వక వందనములు.

*తెలంగాణా రచయితల సంఘం*
హైద్రాబాదు

ఇట్లు,
సి. నారాయణరెడ్డి
ప్రధానకార్యదర్శి

# వర్షామేఘము

అలఘుజ్వాలల మించు కంచుదివిటీలై మందువేసంగి యెం
డలయందెండుటనేమొ ! బెండులయి కొండల్ గాలిలో దేలి, మొ
క్కలుపోనట్టి పవిన్ దళింపబడి మున్ కాసంగరానట్టి తె
క్కలురా, నాకస మెక్కి నిక్కె ననగా గన్పట్టె కాదంబినుల్.

ఆకాశాన తమాలమాలికల ఛాయాచిత్రముల్ చిత్రమై
ప్రాకెన్, తాండవకేళిలోల శివ గుల్ఫప్రస్ఫుటధ్వానముల్
సోకెన్ రోదసి ; కాననమ్ముల కనుల్ సొంపై ప్రకాశించె. ల
క్ష్మీకాంతప్రభు కౌస్తుభప్రభలు క్రమ్మెన్ వర్షకాలాగతిన్.

తెప్పలు తెప్పలై గగనతీరములన్ దిరుగాడుచున్ రవిన్
గప్పుచు నార్చి బొబ్బలిడు కారుమొగు ళ్ళివి యెందుబోయెనో
చప్పుడుసేయ విన్ని దివసంబులు సంబుధులందు నక్కెనో
యిప్పుడు గొప్పలై గిరుల నెక్కి భ్రమించెడి కాలశక్తిచే.

ముందరుణుండు యౌవనపు మోజున చిందులుద్రొక్కునాడు నీ
వెందు పలాయనంబయితి వేసయిపోయె పరాక్రమంబు ; నీ
చందము చూడ నాకు నొక సామెత జ్ఞప్తికివచ్చె మేఘమా !
అందరయున్నచో నడుగు లంతెద వందల మెక్కె వందినన్.

అంబరవేదిమీద ప్రళయార్భటిచేసి ఘనుండు నిల్వ. పిం
ఛంబును విప్పి నృత్యమును సల్పె మయూరము గ్రీష్మతాప త
ప్తంబగు సగ్నదేహమున ధారుణి పచ్చని కోక దాల్చె. భూ
తంబులు నెమ్మనమ్ముల ముదమ్మును జెందె నిదేమి చిత్రమో !

నల్లని మేను, నామమె ఘనమమ్మ, నివాసము శూన్యమౌను, స
త్వెల్ల విషప్రపూరితమె యేమనవచ్చును నిన్ను కాని : నీ
యుల్లములోని యార్ద్రిత యదొక్కటె యన్నిటి మించి, కీర్తి నం
ధిల్లగజేసె, జీవనమునే ధర కోరక ధారవోయుటన్.

నిన్నటిదాక తేపుకద నింగిని, పుట్టియు పుట్టకుండనే
మిన్నెగబ్రాకినావనుచు మెసలుమువ్వను నవ్వుమంటివే
మన్ను ! యిదేమినీతి. నడుమంతరపుణ్యసిరి నిచ్చువారి గ
ర్వోన్నతి నిల్వనీరయి మహోదధిపాలయిపోదె మేఘమా !

చిటపట చినుకులు రాలెను
పటపట వడగండ్లు పుడమిపై బడె, ధారల్
పుటపుటనై కుండలతో
నటునిటు దొరలించినట్టులై వినుపట్టెన్.

నేలపై మోపిన కాలు చుఱుక్కని
బొబ్బ లెక్కెడి దినమ్ములు గతించె,
నించుక యశ్రద్ధ నుంచిన పాదమ్ము
జఱుకుజఱుక్కని జాఱిపోదగె,
పగలు రాత్రి యనక ప్రభు పాలితులు నాక
ప్రజలందఱును ఛత్రపతులె యైరి,
నెఱియలు వాఱిన నేల నంతట నద్ద
ములు దాపినట్లు నీడలు కనబడె.

పులకరించి భూసతి రామచిలుక యయ్యె
హుంకరించి యాబోతులు ఱంకెవేసె.

నాగలిని బట్టి కృషికుడు నడుముగట్టె
నాశ లుప్పొంగి పాటె వర్షాగమమున.

ఉన్నత సౌధ గోపురపు టుయ్యెలమంచములందు తిన్నగా
కన్నులు మూసి గుఱ్ఱుమని గాఢసుషుప్తిని మున్గియుండు సం
పన్నులమీదికిన్ జనగ వాటము కామిని వానదేవుడా!
చిన్నని చొప్పకప్పు గుడిసెల్ వడి కూలగ దాడిచేతువా!

వడలకు వాడిపోయి వడి పయ్యెర యూపుకు పట్టువీడి యీ
గుడిసెల కప్పు లొప్పెడలె, గుంజలు పాదుల నూగులాడెడిన్;
గడగడలాడుచున్నయవి కారుమొగుళ్లను గాంచినంత, నీ
వుడిసెడు పేదకాపురము పొల్లానరింపకు వానదేవుడా!

గపగప చొచ్చివచ్చు చలిగాలికి కప్పులు లేని దీపముల్
తెపతెపలాడిపోయె, చెలరేగిన చీకటిలో శరీరముల్
రిపులకు నప్పజెప్పిన దరిద్రులు నిద్రలుపోయినారు, నీ
విపుడె సవారిచేసి యలయింపకు వారిని వానదేవుడా!

ఒక ప్రణయార్తు వార్తలను నోపికతో విని ము న్నరాళవే
చక కచభారరుమన్ కఠినశాపవశంగత దూరవాసి భ
ర్తృకకును భ్రాతృ జాయకు శ్రుతిప్రియముల్ వచియించి సుంచితం
చొక కవిరాజు మెప్పుగని యొప్పితి, విప్పు డిదేమి? మేఘమా!

——www——

# నన్నయభట్టు

ఉందురుగాక సత్కవులె ఉర్విని నీకును ముందువెన్కలన్
వందలకొద్ది, వారికిని వందన మే నొనరింతుగాని, మా
కందఱికిన్ కవిత్వమున నాదిమభిక్ష నొసంగు నీవ నే
ముందుగ కేలుమోడ్చెద, నమోనమ యంచు కవీంద్ర ! నన్నయా!

నీకు పూర్వము, కవులు జన్మించి రేని
గ్రంథ మొకటేని యిపు డేల కానరాదు ?
నీదు సమకాలికులు నిను మించు రేని
నిండుసభ నేల బ్రతిమాలె నిన్ను రాజు ?

అక్కట ! రాజరాజనృపు నానతి నౌదల దాల్చి నేర్పుతో.
చిక్కని పాలు మిక్కిలి రుచింపగ చక్కెర జేర్చునట్టులన్
చక్కని తెన్గుమాటలను సంస్కృతశబ్దము లింపుగూర్చి. యు
మ్మక్క యనంగ భారతము నందముగా వెలిగింపవే కవీ !

చక్కని శైలితో సరసశబ్ద బహూకృతి భావముల్ రుచుల్
గ్రక్కగ పద్యముల్ నుడువగా గడు దక్షుడ వీవు : భారతం
బక్కఱణిన్ త్రిపర్వములె యాంధ్ర మొనర్చి ముగించు టెన్నగా
తిక్కన పూర్వజన్మకృత దివ్య తపఃఫల మౌనొకో కవీ !

కట్టడి విధికిన్ కన్నులు
గుట్టెనుగాబోలు కృతియె కొనసముట్టదు ; కా
కట్టె ట్టనవచ్చునె, నీ
పెట్టిన యదిగాదె ! తెనుగుభిక్ష కవీంద్రా !

నీ కవనము ప్రతి కనుగొన
నా కవనిఁ గానరాదు; నవరస భరితా
నేకఫల సతానోకహ
నాకవన మొకండు కాక నన్నయసుకవీ!

లలితము లార్ద్రముల్, సరస లాక్షణికంబులు, మంజులార్థ సం
కలితములుఁ బ్రసన్నములు కర్ణసుఖంబులు, భారతీవధూ
గళ కలితాచ్ఛ మౌక్తిక సఖంబులు, పావన తావకీన సూ
క్తులు, రమణీయమౌ తెనుగుతోటల పూచిన పూలు సత్కవీ!

ఆతత బుద్ధికౌశల మహామహిమఁ గదియించినావు వ్యా
ఘాత మెఱుంగనట్టి కడు గట్టిపునాది తెనుంగుబాసకుఁ
నీ తరువాత వచ్చెడు మనీషులు, సత్కవులైన పూర్వులుఁ
నూతనులుఁ రచింపగ మనోహరహర్మ్యము లెన్నొ దానిపైఁ.

ఘనమతుతెల్ల సంస్కృతమె కావ్యసరస్వతి కింపుగూర్చు భూ
షణ మగునంచు, నాంధ్రమును సత్కృతులందు బహిష్కరింపగా
దినదినముఁ కృశించి, నిజతేజము గోల్పడు తెన్గుకన్నె జీ
వనమును నిల్పినావు, నిజవాగమృతౌషధ మిచ్చి సత్కవీ!

భవదాంధ్రీకృతమైన భారతము, కల్పాంతస్థిరస్థాయియై
భువనం బెల్ల భవద్యశోలతల సంపూర్ణంబుగా నల్లి గౌ
రవయుక్తంబుగ నాంధ్రపుత్రకులు వర్ధంతుల్ రహిఁ సల్పగా
దివి నీ యాత్మ వెలుంగుగాత! ధిషణాబ్ధీ! సత్కవీ నన్నయా!

# దాగుడుమూతలు

దాగుడుపడ్డ యీ భువన మంటప కేళి విహార లోలురై
ఆగక వచ్చి మూగెడి యనంత జగజ్జనముల్ క్రమంబునన్
దాగుడుమూతలాడ, కనుదమ్ముల మూసెడి తల్లి యెవ్వరో?
ఏగెడి వారిలోన దొర లెందరొ? చెల్లని దొంగ లెందరో?

ఏగెడివార లాడుకొని యేగ తదీయ పదాంక ముద్రితా
ధ్వాగమనేచ్ఛులై యెదురుతాకుచు వచ్చు నవీనఖేలకుల్
మూగుదు రప్పుడప్పుడె సముద్రతరంగములట్లు, క్రమ్మరన్
వేగమె విచ్చిపోవుదురు ఫేనసముద్గత బుద్బుదక్రియన్.

ప్రోగులు ప్రోగులై యిసుకపోసిన రాలని వాలకంబునన్
మూగిన మూకలో, నొకట ముందుకు వెన్కకు బారు వీరిలో
నాగతు లెందరో యిట ననాగతు లెందరొ, యిందులో నన
భ్యాగతు లెందరో యతిథులై చనుదెంచినవార లెందరో?

అక్కట నేలయీనినటు లంతట వింతగ నిండియుండె, యే
దిక్కున చూడ తామెయయి త్రిమ్మరునట్టి యుసిళ్లపుట్టలై
ఎక్కడనుండి యెక్కడకు నేగుచు యిక్కడి కేగుదెంచిరో
నిక్క మెఱింగి తెల్పు మహనీయులు యీ యిలలోన నెవ్వరో?

ఇక్కడ కూడినట్టి జను లెందరొ మందర యిందు లేరు, మం
దిక్కడ నున్నవార లిపు డెందరొ కానగరారు, చిన్నదై
చిక్కుల దుక్కియౌ కడు విచిత్రపు దాగుడుమూతలాటలో
నుక్కిరిబిక్కిరై నిలువనోడుచు సూడనిబాడియుండిరో?

ఆటకు రాకముందు దొర లందరు, మీదట దొంగలైనవా
రోటమి జెంది, కన్నుగవ లొక్కట మూయగబడ్డ పిమ్మటన్
నేటుగ బర్వుచుంద్రు, తమ నేరము లన్యుల నెత్తి రుద్దగా
చాటున నక్కియుండు దొరసంఘము భీతిని నిక్కిచూడగన్.

అందరుగూడ తాము దొరలన్న యథార్థము విస్మరించి యీ
వందల వేలనుండి, తమవారినె దొంగ లటంచు బల్కుచు౯
నిందలు మోపుచు౯ తమకు నేటుకువచ్చెడు దమ్ములేక, యి
బ్బందుల గొందిలో నణగి బాధలపాలగుచుంద రక్కటా!

రాత్రులయందు ప్రొద్దుల విరామములేక నిరంతరమ్ము నీ
సత్రములోపలన్ దిగి వెసన్ జనుటే పరిపాటి యయ్యె, నీ
ధాత్రియు దాగురింతలె, యథార్థమటంచు భ్రమించుచుంటయే
చిత్రములోని చిత్రము విచిత్రపు దాగుడుమూతలాటలో!

క్రీడావేశము ముమ్మరమ్ముగొన స్వర్గీయస్థితిన్ వీడి, ని
ర్వ్రీడామానసులై పరస్పరజయశ్రీకాములై పోరు యీ
చూడాబద్ధ కిరీటఖేలకుల కిచ్చో వచ్చుచుం బోవుచో
జూడన్ గన్నులుమూయు 'తల్లి' యొకతే నూ! సాక్షియై నిల్చెటో!

# కర్షకా!

దినమణిదీధితిచ్ఛటల తీక్ష్ణత కెంతయు నోర్చి యోర్చి, యా
సనమున గ్రమ్ము చెమ్మటకణమ్ముల తష్టిని నూర్చి యూర్చి, కా
ననమున కాళ్ళు కట్టెలయినన్ దిటుగాడుచు, తాపకీన పా
పన దినచర్య దీక్ష దయివారగ సల్పెద వీవు కర్షకా!

నేలయె మేలుకాగిదము, నీ హలమే కల, మాహాలమ్ము కి
ట్టే లిఖియించు పాళి, జలమే యల నీలిసిరా యనంగ, బల్
చాలుల నడ్డమున్ నిలువు చాల లిఖించి రచించు చింత గ్రం
థా లవియేవొ! యింత విదితం బొనరింపగదయ్య కర్షకా!

కొంపా నాస్తి వసింపగా, కుడుపగా కూడేనియున్ లేదు: మా
నంపుంగొంప బిగింపలే దకట! జీర్ణంబైన చేలంబె; తా
పెంపౌ పిల్లలగూడు ప్రత్యహము, నీ బీభత్ససంసారమే
తెంపుం బూని భరింతు సంతతము పృథ్వీషుష్షకా! కర్షకా!

కంపలు నాటి చేనులకు కాపలిగాసి; ఫలించు సస్యముల్
గంపలలోన నెత్తి తల కాయలుగాయగ మోసి, నీదు ర
క్తంపురుచిన్ మదించు నపుకారి దుకాణము నింపుచుందువే!
కుంపటిలోన నేకులను గుప్త మొనర్చినభాతి కర్షకా!

కత్తులబోనుసం దిడిన కంఠమునం దురిబోసి చూచినన్
సత్తైమెకాని యింకొకటి జారదు నీ రసనంబునుండి, యే
జిత్తు లెఱుంగ వీ సకలజీవుల సేవలెనే తలంతు, నీ
నెత్తురు నీరుజేసి ధరణీజనులన్ దనియింతు కర్షకా!

ముత్తెమువంటి చినుకు లోఁగి భూమిపయిన్ బడినంత, నింటిలో
విత్తులు మంటిలో గలిపి వేసరు యంత్రజలాభిషేచనన్
కుత్తుకబంటి పైరు లిల గుంపులు గుంపులుగా సృజింతువే ।
మృత్తిక ముట్టి హేమ మొనరింతువు గారడివోలె కర్షకా !

పాలేరై ప్రవహింతు నీ పొలములన్ పండించుచో పైరులన్
రేలున్ రేపులు రక్షజేసెదవు వానిన్ శ్రద్ధతో కాపువై
ప్రాణిన్ లోకుల కెల్ల నన్న మిడుచున్ పాలింతు వాసామివై
భూలోకమ్మును బెంప నుద్భవిలు దేవుం డీవెకా కర్షకా !

ఆకలిమంట కింత కలియైన లభింపమి, డొక్క వెన్నుతో
నేకముగాగ, నాల్క తడి యెండగ, గొల్లున నేడ్చు పిల్లలన్
సాకగలేక నీ కనుల జాల్వడి కాల్వలుగట్టు బాష్పముల్
మా కెఱిగించు నీ కడుపుమంట తమంతట తామె కర్షకా !

# ప్రశంసా పద్యావళి

మును మన్మిత్రగణమ్ము మీ హరికథామూర్తిన్ బ్రశంసింపగా,
విని: యేతాదృశులైన మీ కథల సాపేక్షన్ వినన్ గోరి, నే
డనపేక్షన్ లభియించె నాకును తదీయాకర్ణనాభాగ్య, మే
మననేర్తున్ ననలెత్తె చిత్తము, మహాత్మా శ్రీ[illegible]ంగేశ్వరా!

తనివారన్ గనుగొంటి మీ స్పృహరిగాథా బోధనాశక్తి, నా
మనసారన్ జవిగొంటి తావక సుధామాధుర్య గానోక్తి, నే
గనుగొంటన్ భవదీయ నైతికకథాఖ్యానంపు టాసక్తి, నో
యనఘా ! కాంచితి శైవవైష్ణవ పదావ్యాజంపు సద్భక్తియున్.

సంగీత మున్నచో సాహిత్యలోపమ్ము.
సాహిత్య మున్న సుస్వరము సున్న:
సంగీత సాహిత్య సామరస్యం బున్న
సమయోచితజ్ఞతా శక్తి సున్న:
సంగీత సాహిత్య సమయోచితులు నున్న
వాగ్ధోరణీ పటుత్వంబు సున్న:
సంగీత సాహిత్య సమయోచితజ్ఞతా
పటిమ లున్నను సభాభయము సున్న:

ఇన్ని యలవడియును భక్తిహీనమైన
రక్తి శూన్యమ్ము శ్రోతకున్ ముక్తి లేదు:
ఇన్ని గుణములు నీయందు యేకముగుట
ధన్యుడవు నీవు, పితరులు ధన్యతములు.

వాతాత్మజుని మనో వనజాతమున బుట్టి,
శబరి యెంగిలిపండ్ల సార మెఱిగి,
ఋషి సమర్థుని దాసబోధా నిధానమ్ము
పొంది, కబీరులో పొంగి పొరలి,
త్యాగయ్యగారి గీతాసుధావీచులన్
పారవశ్యత తాండవం బొనర్చి,
పొసగ గోపన్న మానస సరోవరములో
రాజహంసికయైన రామభక్తి

నీకు స్వాధీనమయ్యె పునీతచరిత
మీ పురాకృత పుణ్యసమృద్ధికలన,
ధన్యుడవుసుమ్ము భక్తాగ్రగణ్య ! యుష్మ
దీయ చారిత్ర మాదర్శనీయముగద !

భారతపుణ్యభూమిని, సెబాస్ జనియింపగ గంటి, ఎందు నిం
పారుచు శ్రీల నొప్పెడి, మహాంధ్రపురంధ్రికి బిడ్డవౌచు తీ
పారెడు తెన్గుతేనె కడుపార గ్రోలగ నోచుకొంటి ; వౌ
రా ! రహిమీర నందు వ.సు.రాయని చుట్టమవైతి వెంతయున్.

ఆంధ్రగీర్వాణమ్ములందుమాత్రమె కాదు
పాశ్చాత్యభాషా విపశ్చితుడవు,
పొట్టబోసికొనంగ పూనుకొన్నది గాదు
హరికథా సంకీర్తనానురక్తి..
ఆవేశపరత నిన్నాడించు హరిభక్తి
నాస్తికు నొసరించు నాస్తికునిగ,
దేవతార్చన మహీదేవ సంభావనా
వైదికాచార సద్వర్తనుడవు,

మనసుచే వాక్కుచేత కర్మంబుచేత
ధరింతు శ్రీరామునామ సుధాపిపాస
రక్తి బరుపెత్తు భక్తమురంగమునువు,
ధన్యుడను నేను తాపక దర్శనాప్తి.

తీర్చిదిద్దిన పెద్ద తెల్లని నామాలె
అచ్చంపు హరిదాసు వగుట దెలుప.
శ్మశ్రులాననము కాషాయచేలాసక్తి
నీ నిరాడంబర నియతి దెలుప.
అల విపంచికల తీయందనమ్ములు గొన్న
కంఠ మాధురి గాన గరిమ చాట,
ఒప్పిదమైన నీ కుప్పిగంతులె చెప్ప
రహీ కురంగేశ్వరరావభిఖ్య.

బిరుదు పతకముల్ మెడనిండ వేయ మీరు
లోపపు లౌటారిములకె యాటోప మెందు
ప్రతిభ గలవారి కేటికి పదక చయము
అరయ ముంజేతి కడియాన కద్ద మేల !

ఇవి గల వవి గల వని నే
ను వచింపగ నేల తడవి, నోరూరింగ, స
ర్వ విదితములు మీ సుగుణము
లవనిని నవి యెంత జెప్ప నగు సహజోక్తుల్.

మిమ్ము జూచిన మొదలు చిత్తమ్మదేమొ
నన్ను ప్రేరేచె మీదు సన్మానమునకు
భక్తితో నల్లి తెచ్చితీ పద్యమాల
స్వీకరింపుము చిత్తమ్ము రేకులెత్త.

# కరవాలము

కమ్మరి కొల్మి మంటల, వికారపుకాకలు సైచి, పిమ్మటన్
సమ్మెటపెట్ల కోర్చుకొని సాగితి, వాపయి, నాకురాయితో
దుమ్ముగయంగ రాచినను, దూరక ఊరకనుంటి, విట్టి నీ
సొమ్ముగుగాక కీర్తిరమ, సోమరి కెక్కడి కీర్తి ? ఖడ్గమా !

పేరు ప్రతిష్ఠ లేక యటవీగిరిగహ్వరసీమలందు ముం
దూరక త్రుప్పువట్టి పడియుండెడు నీ కొక పేరు, సుందరా
కారము, కంఠసూత్రముల గాత్రముతో విడదీయు శక్తి, చే
కూరుట నీ తపఃపటిమకున్ ఫలితం బగుగాదె ఖడ్గమా !

వీరకులంబుకెల్ల కులదేవతవోలె శుభంబు గూర్చుచున్
భీరుజనంబు కంతకును ప్రేతపతింబలె భీతిగొల్పుచున్
ధారుణి నేలు రాజులకు దక్షిణహస్తవిభూష వౌచు ; స
త్కారము అందుచుందు విల, గౌరవనీయమ ఖడ్గరాజమా !

అరయ ' నుక్కుతునక ' వయి ఆలములో నెదురైనవారలన్
ధీరతతోడ డీకొనుచు త్రెళ్ళగజేతువు వారికుత్తుకల్
వాటిల కంఠసీమగల దారముతో భువి నొక్క వ్రేటునన్
వీరకిశోరమూర్తి ! పృథివీస్థలి నీ కెవ రీడు ఖడ్గమా !

వాలమె లేదుగాక, కరవాలమ! సాహస విక్రమాదులన్
వాలివి నీవు, భూరిబల వాయుసుతుండవు, సర్వకాల మా
భీలవిషాగ్ని గ్రక్కు కడు భీకరపన్నగరాజు వౌదు, సిం
హాలకు నౌదు సింహము, విహంగమరాజమ వౌదు ఖడ్గమా !

మంటగల్ప వవెన్ని మంచి సంసారాలు
పాపిమానవ కరస్పర్శకలన:
కోయలే దెన్నెన్ని గొఱ్ఱెల గొంతుకల్
కటికవారల చేతి కలుషమంట:
చేయలే దెన్నెన్ని స్త్రీ శిశు హత్యలు
నిర్దయాత్మలహస్త నిపతిత మయి:
కడతేర్చలే దెన్ని గర్భస్థ పిండాలు
ప్రాణఘాతకుల చే బడుటవలను:

హేతిసత్తమ ! యీ పాపభీతి ననగ
దాగియుండెద వొఱలోన తస్కరువలె.
బయటి కీడ్చినమాత్రాన వణకిపోదు
గరుడు గనుగొన్నయట్టి నాగంబుపగిది.

పాలింపవే తొల్లి భరతఖండంబెల్ల
దౌష్యంతి కరముల తాండవించి
కాపాడవే మున్ను కాళిదాసాదుల
భోజరాజేంద్రుచే పూజలంది
పోషింపవే ఆంధ్ర యోషామతల్లిని
కృష్ణరాయల కరాకృష్ట మగుచు
చాటింపవే తెన్గు శౌర్యమ్ము మొనమొన్న
గొంతెత్తి బొబ్బిలి కోటనుండి

నమ్ర పరరాజ మస్తక న్యస్త శస్త
మకుట కీలిత మణిఘృణీ మండితాంఘ్రి
కమలయుగళాంధ్రరాజేంద్ర కరవిరాజ
మాన ఖడ్గమా, నే డెందు మాయమైతి !

# పుష్పాపచయము

రాత్రి వికసించి పాదుల రాలినట్టి
కమ్మని సుమమ్ము లెన్నియో కాలదన్ని
అందరాని లతాంత లతాంతములను
కోసెదవు శ్రద్ధతో నేరికోస మిటుల !

సార మకరంద పూరిత పారిజాత
వారముల జేరి మధురస మారగించు
మధుకరమ్ముల కరముల మరలగొట్టి
యేరి కోసెడి విరు లవి యేరికొఱకు !

ఇప్పుడిప్పుడె విప్పారి, కప్పురంపు
వాసనల గుప్పు పుష్పాల వ్రాల వచ్చి
ఝుంకృతు లొనర్చు తేంట్లకు జంకకుండ
చేయు పుష్పాపచయ మేరి చేతికొఱకు !

దళపుటమ్ముల దాగురింతల నటించు
మంజు సురభిళ మాలతీ మంజరులను
చేరలంతలు కన్నులు జేసికొనుచు
ఊన మొనరింతు వెవరి కీబూనినావు ?

వృంతములు దృఢబంధ సంవృతము లగుట
కింకిణీక్వణ మెసగె నికృంతనమున
చరణ మంజీరవితతి శింజానమయ్యె
కోరి కోసెద వేరికీ కోరకములు ?

కొమ్మకొమ్మకు చేసాచి కోసినట్టి
పూయి, కలికలు నీ చేతి పుటిక నిండె
గిల్లె దేటికి రాగిల్లి మల్లెపూలు
చెల్లవో ! యేరికై త్రుంతు మొల్లపూలు.

మొగలి రేకులలోని పన్నగము నరసి
ఎవరి తిరుగగ నీవెన్క వ్రేలు వేణి
నహీ యని భ్రమించి నిను దరియదు భుజంగి
చాలుచా తేరికోసమీ సాహసంబు ?

నీదు గోరంట గోరంట నిగ్గు తగ్గె
విరియ బూసిన విరజాజి వెలవెలయ్యె
కలియబూసిన కనకమ్ము కళలుదప్పె
చాలవా పూవు ? తేరికై సంగ్రహింతు ?

పర్ణముల లతల బిమ్మిన బరణి నిండె
చెరివి కట్టిన చిటికోక చెరగు నిండె
చాలుచాలు గులాబీలు చాల గలగె
విసు వెఱుంగవు: యెవ్వారి కొసగ దలతు ?

కోయ గోసితి వింతలో మాయదోప
చూచుచుండగ సురుచిర సుమనరమ్ము
చేయజేసితి ! నీ నేర్పు చెప్పతరమె
రంగురంగుల చిత్రంపు రచన ప్రతిభ !

సంతతామోదకారియౌ వింత దండ
సంతతామోదకారియౌ యింతి దండ
ఏమహాభాగు గళసీమ నెనయజాలు
నతడె కృతకృత్యు డగును ఈ యవనిలోన.

# రెడ్డి రాజులు

శ్రీరమాపారతాక్షము సమృద్ధిగ వర్ధిల శౌర్యధుర్యులై
కాకతిరాజ్యలక్ష్మికి వికాసము గూర్చిన సాహసీకులై
వీరవరిష్ఠ సాంధ్రకృతిదీపితులై స్తుతిగాంచి, పండితా
నీకము బ్రోచినట్టి మహనీయులు తొల్లిటి రెడ్డిభూపతుల్.

రామాయణమ్మును రచియించె ద్విపదగా
భూరియశోరాశి బుద్ధరాజు.
రచియించె నాట్యశాస్త్రము నేర్పున " వసంత
రాజీయ " మను కుమారగిరిరెడ్డి.
అమరుకావ్యవ్యాఖ్య నతిసుగమంబుగా
విరచించె కోమటివేమ నృపతి.
కాళిదాసుని నాటకముల వ్యాఖ్యానించి
వెలసిల్లె కాటయ వేమవిభుడు.

విద్యావధిమాని మన అనవేమరాజు.
ఓడువా యను మాటలు వేయునేల !
కవులు, కవిపోషకులును, భూపులు నైన
రెడ్డిరాజు లంతేనియు దొడ్డవారు.

కలమున్ బట్టి రచించి రిద్ధరసవత్కావ్యంబు లెన్నేని, యు
జ్జ్వలఖడ్గమ్ములు దాల్చి శత్రుశిరముల్ చక్కాడి రాజన్యు ప్రతి—
మాలయముల్ చేరాని బీటిభూములను సస్యశ్యామలాఢ్యమ్ములౌ
కాలయముల్ చేసిరి రెడ్డిరాజులు యశఃపూత ప్రభుత్వాఢ్యులై.

తమ యశశ్చంద్రికాధవళితాశాంతమున
పాలవెల్లువ తెల్లవారి చూచి.
తమ గభీరస్వభావము గాంచి తోయధుల్
తలకి మబ్బుల తలల్ దాచుకొనఁగ.
తమ పరాక్రమవహ్ని తాప మోపక రిపుల్
పరువెత్తి అడవులపాలు గాఁగ.
తమ దానధారాళి దాటు సైపక మత్త
సామజమ్ములు దిశాసమితి సేరఁగ,

వాలు వాలన నిముసము చేసాచినంత.
ఆంధ్రజాతిని సంస్కృతి నాంధ్రభాష
నాదరింపుచు, రెడ్డివంశాధిపతులు
మేలు మేలన నాంధ్రోర్వి నేలినారు.

కాలవాహిని విపరీతగామి యయ్యె,
కాని; నేమను ధీరులు కలరు, కవులు
కలరు, భాషాభిమానులు కలరు; వీరి
ఏకమైరేని మన జాతి కేమి లోటు ?

# తెలుగు వాణి

స్వస్తి సమంబ ! ఓ తెలుగువాణి ! యుష్మాంయుణ మంజుఘోషణ
గ్రస్త సమస్తదిగ్వలయ కాంచనకంకణపాణి ! నిత్యశ్రీ
రస్తు ! ఇతోధికాధిక మహావిభవోస్తు ! జయోస్తు ! తే ప్రసన్
నిస్తుల కీర్తిరస్తు ! జననీ ! సకలాంధ్రమయీ సరస్వతీ !

ఏదేవి పదములం వేదార్థసుధ చిల్కె
                    రాజరాజేంద్రు నారాధ్యు డయ్యె.
ఏదేవి యక్షరాకృతి దర్శనావాప్తి
                    నన్న యాంధ్రకవీంద్రనాథు డయ్యె.
అష్టదిగ్గజముల నలరించి యేదేవి
                    నాంధ్రభోజుడు యశస్సాంద్రు డయ్యె.
ఏదేవి నవముల పాదార్చన మొనర్చి
                    పల్లకి నూరేగె నల్లసాని.

తొల్లి యేదేవి సితకీర్తి పల్లకాళి
అల్లుకొని యూగె కల్పవృక్షాగ్రసీమ
నన్ను నేదేవి మనసు ప్రసన్న యయ్యె
నట్టి మా తెల్గు తల్లికి నైదుపదుము.

ఆతడు రాము డితడు నగు సత్యనారాయ
ణుండు పోల్కి యింత యుండుకతన,
ఘనము లుట్టిపడగ రమణీయ వాగ్ఝరి
నతని కతలు బలుక నగు నితనిక.

రీతులు వృత్తులు శయ్యలు
నాతత గుణములును లేని యవి కైతలె, నీ
చేతికె మ్రొక్కంగావలె
తైతైయని తాండవించు తావకకృతులన్.

మాసముపట్టు నొక్కొక సమాసముకోస మటన్న నిట్లనా
యాసముగా పదార్థసముదాయౌచితికిం బరిపుష్టి గూర్చు వి
న్యాసముతో ననేకవిధయాన సమాసములన్ ఘటించుచో
మాసము లొక్క లిప్త లని మీసముపై చెయివేసి చెప్పెదన్.

ఊరక గిల్గిలించు మధురోహ లపోహము, లింతగాని గం
భీర రసార్ద్రభావ శరవిశ్రుతి, స్వర్ధ్రుని పక్వ గోస్తనీ
వారుణి, నారికేళఫలపాకము లంట ! త్వదీయకావ్య సం
సారవిహారధీరవిలసన్మతులైన బుధాళి కెప్పుడున్.

కోరిన యర్థసంపదలు, కోరికదెక్కు డలంకృతుల్, యస్పృ
చ్ఛారతిరాగముల్, నవరసంబులు క్రొంబొగ లూదు పాకముల్,
కోరకమున్ పరింమసట కొల్లలుగాగ త్వదీయకావ్యసం
సారవిహారధీరవిలసన్మతులైన బుధావళిన్ కవీ !

మిసమిసలాడు శబ్దముల మేలిమి, లోతులలోని భావపున్
గుసగుసలాట, పాదముల కుంటువనం బెటలేని శైలియున్,
రుసరుసలాడు వింతయపురూపపు పోకడ లేమి చెప్పుదున్ !
బుసబుస పొంగివచ్చు రసపూరము నీ పసగల్గు కైతలన్.

ఒకటా రెండా గుణములు
ప్రకటము గావింప నెంచ ప్రత్యేకముగా.
పరిపరిమములోను, ప్రతిభా
వికసితధీశాలి వైతివిగద! కవీంద్రా!

ఇందుఘటితు కొరక బిల్వము
చందురునకు నూలుపోగు చందమున. మహా
హాం దగుయు భావగతులను
సందీయుంపని సుపద్మప్రాంజలు లిత్తున్.

వాసము నిమపై యెంతో
మాసము పోజాలు, పిరులు వాసిటపను గాసి,
జారిపడె నూడి యెటనో!
తోపపుమెడ చుట్టుతిరుగడో! సరసు కవీ!

తారి మిసు నాకు జూడగ
నెల వారయించురయు లేదు. నేర్చుకొలది యా
యలరులను గ్రుచ్చి తెచ్చితి
పల పెరుగని యట్టి పట్టి వాసన పేర్మిన్.

---

# ఆంధ్ర పితామహుఁడు

శ్రీకర మాడపాటి కులశేఖరుఁ డీ హనుమంతరావు బ్రా
హ్మీ కరుణాకటాక్షము సహీసముగా గనినట్టి మేటి, వి
ద్యా కమనీయధీవిలసితాత్ముఁడు నాంధ్రపితామహుండు న
స్తోకగుణాకరుండు దయతో మత మత్కృతి స్వీకరించుత౯.

ఆదర్శనీయుఁడౌ నాంధ్రపుత్రుఁ డెవండు
  జాతిచేత విశుద్ధనీతిచేత,
ఆదినుండియు న్యాయవాదియౌ నెవ్వండు
  వృత్తిచేతను చిత్తవృత్తిచేత,
ఆడంబరములేని యాంధ్రనేత యెవండు
  శాంతివేళలను సశాంతివేళ,
తనజాతి మేలునే తనమేలు నెవండు
  చాటునందే సమక్షమునసేని.

అట్టి పంతులుగారు భాగ్యనగరపుఁ
బ్రథమ పాలక సంఘాధిపతి పదవిని
పోటిలేకుండ మాటిగా పొందియుంట
నిజమి యాంధ్రుల భాగ్య మింకేమి చెప్ప!

అన్యులపట్ల సేవలుకులౌ స్తుతిపాఠము లట్టివెల్ల సా
మాన్యములౌచు నొప్పును సమస్తగుణంబుల కిక్కయైన యీ
మాన్యునిపట్ల; నీత డసమాన విలక్షణకీర్తియయ్యు సా
మాన్యునియట్లు నిల్లునికమాత్రమె చాటదె వీరి సత్త్వము౯!

# సీత వలపోత

కుహనాతాపసమూర్తి రావణుడు, సక్రోధాత్ముడై, దండకా
గహనాంతస్థ పలాశసద్మనిలయఁ, కల్హారనేత్రఁ, ముహుర్
ముహు రాక్రందిత 'రామరామ' ను, వినిర్ముక్తాశ్రుముక్తాయుతఁ
బహు వారాన్నిధిమధ్య సింహళవనిఁ బల్మిఁ జెరం బెట్టినఁ.

గడగడ మేన్వడంక, కడకన్నుల నొత్తు కవోష్ణబాష్పముల్
జడిగొని గండభాగముల జాఱగ, నూత్నవియోగవేదనన్
దడదడ గుండెకొట్టుకొన, దానవనాథు పురమ్ము నల్గడల్
చిడిముడిపాటు పైకొనగ సీత కనుంగొని, వీతధైర్యయై,

శిర మొక్కించుక వంచి, ఉస్సురనె, నా శ్రీరాఘునిల్లాలు, వి
స్ఫురదంభోరుహ సుందరానన సువిస్ఫూర్తుల్ విడఁ, యాతనా
ఖర మత్యుద్ధతమూర్తిమంతమయి, హృద్భారమ్ము రెట్టింపగా,
నొరిగెఁ గర్కశభూవిభాగమున దా నొక్కుమ్మడిన్ విస్మృతిఁ.

ఆవిధి నిమీలితాక్షియై, యంతరంగ
సీమ దళుకొత్తు నిజనాథు మోము గాంచి
పెన్నిధిని జూచి యుప్పొంగు పేద భంగి
నుబ్బి యుత్సాహవారాశి నోలలాడి,

వచ్చితే నాథ! ఇక నన్ను వదలవలవ
దంచు కౌగిట నదుముగా హస్తయుగళి
ముందునకు జాచి, యెదియు చేయ్యుంధకునికి
అతివ తన్నుదా గట్టిగా నలమికొనియె.

ఆ బాహ్యణము మున్నదున్నటుల నెపమ్మాత్రమే ! యిచ్చోటికిన్
నీ బాహాద్వయి చిక్కనుండ జనునేనిం ధర్మచర్మమ్ము దె
య్యా? బాణమ్ముల ద్రాణ మూడ్చి యని, ని న్నట్లంపి యిల్లైతిగా,
‘ స్త్రీబుద్ధిః ప్రళయంకరీ ’ యనెడి వాక్ (శ్రీ) సత్యమై తోపగన్.

భావమునందు నిచ్చమగు భక్తి గడల్కొన, లక్ష్మణుండు ఘో
దావహారిల సేవల నహర్నిశమున్ బచరింపుచుండగా
నావనపర్ణశాల గడు హాయిగ నుంటిమిగాని, నాథ ! యి
ట్లీ వారచోట వేరొకట నే నను మాట కలన్ దలంతుమే ?

“హరు నేత్రాగ్ని, మహేంద్రు వజ్రము, వైకుంఠాధీశు చక్రమ్ములే
సరిగా రాఘవు తేరిచూడ వెఱచున్. సారంగ మేలెక్క ? నీ
వెఱపున్ మానగదమ్మ ! అన్న యిపుడే విచ్చేయు” నం చీవనన్
మఱచీ ! నిన్ననరానిమాటలని, అన్నత్కర్మ మిట్లయ్యెగా !

సద్యాంభోజదళాయతాక్షు డగు మన్నాథుండు నన్ జేరగా,
సద్యోమోహమనోగతిన్ చపలతన్ సవ్యాపసవ్య ప్రసం
గ వ్యాపార నిమగ్ననై, సుఖముగా కాలమ్ము పోద్రోలు నే
క్రవ్యాదాధము పంచలం బడి మహాకష్టాల పాలైతిగా.

గాసిలి యేడ్చునట్టి నను గావగ వచ్చి, వధమ్మునందు రా
కాసి నెదిర్చి, ఖడ్గహతి కాయము ద్రెళ్ళి, జటాయు వాయువున్
బాసెను ; ఘోరపాత్ర యినవంశజు డెవ్విధి గుర్తెరుంగు ? నే
నీ నడిగుండ మీదగల నెట్టులు ? ప్రాణమె భారమయ్యెడిన్.

పాయని శోక మిదగ నుపాయము ప్రాణముపాయు టొక్కటే.
కాయము పాయగా ననధికారిని గాపున, దుఃఖభాజనం
బే యపుగాక, జీవముల నెట్లొ ధరించెద గొన్నినాళ్ళు, నీ
వీ యసురన్ వధించి నను నేలుకొనందగు జీవితేశ్వరా !

# సుమాహరణము

కోయగబోకుమోయి పువు గుత్తులు, పచ్చని తీవ చెల్వముం
బాయును, రెక్కలూడి వసివాడు ప్రసూనము, తావిబోవు. నా
తీయని తేనెజిందు నని తిన్నగ విన్నప మాచరింతు, నే
గోయకయుండినన్ పువు నికుంజమునన్ పడదాకి వాడదో ?

ఆ లతికాలలామ కడుపారగ గాంచిన హృద్యమైన పు
ష్పాలవి, భాను తీక్ష్ణతకు వాడి కృశించును కొన్ని, కొన్ని పూత్
గాలికి నేల రాలి నవకం బెడబాసి నశించు గాన, నీ
కేల వృథా ప్రయాసము, లయించెడి ప్రాణుల కీపు కత్తివే ?

నీ హృదయంబు నవ్యనవనీతసమానము, పూలమీద వ్యా
మోహము నీకు మెం; డొరులు ముట్టిన, త్రుంచిన పూవు తీవెనన్
దోహదమున్ బొనర్తు, కనుదొప్పల దోగినబాష్పవారి సం
దోహముచేత; పుష్పములు త్రుంచవు నీ నఖపల్లవంబులన్.

పూచినపూవు సౌరభము పోవును గాలికి, గందు తుమ్మెదల్
వే చనుదెంచి మాధురసబిందుల విందుల నారగించు, తద్
రోచకమున్ మృదుత్వము విరోచను కాంతికి గందు, నింక నీ
లోచన మేమి జూచు తమి యాన మొనర్చిన నొచ్చు పూవులన్ :

తల్లిని పిల్ల బాయు హృది తల్లడమల్లడమందు, నైన తా
నల్లుడు నిల్లుజేర దనయన్ దమకంబున బంపు, నట్టి లా
వల్లికకున్ సుమంబులు కెడబా టగుపట్ల [illegible] బాష్పముల్
కొల్లలుగా స్రవించినను, గోసెడువేళ శిరంబు నూపదో !

చూచి సహింపలేకనో, యసూయత చేతనో, చేతి తీటనే
యాచికొనంగలేకనో, సుమాహరణం బొనరించెనన్ కృథా
వాచక ఘాతివాక్యముల సూదుల గ్రుచ్చకు నన్ను, దేవపూ
జోచిత ద్రవ్యమంచు, పువు గొల్చితి నేను ప్రసూనరక్తుడా!

స్వార్థ మెఱుంగ నేను పరమార్థ మెఱుంగను గాని, పుష్పముల్
వ్యర్థముగా జనించు లతయందె నశించుట చూడలేక, నే
సార్థకజన్మ వానికిడ, సామరందము బిందు పూలు, పూ
జార్థము సేకరించిన రహస్యమెఱుంగు, సుమానురక్తుడా?

కమ్మని పూలు కన్నులను గాంచిన గల్గును తృప్తి నీకు, సూ
నమ్ముల కొమ్మమీద నయనమ్ముల జూచిన, గోసి, యీశుపా
దమ్ముల నుంచి, తచ్ఛరణతామరసార్పిత మానరాట్ప్రసా
దమ్ము పరిగ్రహించి, వనితామణి చారువినీల కేశపా
శమ్ము నలంకరింపక, ప్రశాంతము గల్గదు నా మనంబునన్.

పుట్టెడు వాంఛలేక పువు ముట్టరు, ముట్టిన కోయబోరు, తా
బట్టిలతావితాన సుమ భవ్యగుళుచ్ఛము పాడుజేసి, నే
వట్టిగ బారవేతు నను భావము మాను, లతాంగి కైశికిన్
బెట్టిన, వేణిసొంపు పువుపేరిమి పెంపు వహింప జూచెదన్.

ప్రకృతియె మంజుగంధ ప్రసవ ప్రకర ప్రసవిత్రియౌ లతా
వికృతిని, ఈ యథార్థపు వివేకము గల్గినవాడె చూడగా
సుకృతి ధరిత్రియందు గల సుందరవస్త్వనుభోక్త గాన, నీ
వికృతపు మాట లేల? కమనీయ సుమంబుల నేను గోసినన్.

# తెలుగు కన్నె

ఏను నజ్ఞాతమాతృక నింతపరకు
ఆస యెటులుండు జనకజిజ్ఞాస కింక
నన్ను ఏయమ్మ సాకెనో చన్ను గుడిపి
బ్రతికియున్నానొ ఏయయ్య ప్రాపు పడసి !

జ్ఞాన మించుక యెఱిగెడి కాలమందు
చూడ నేనుంటి తెలుగుల చూరునీడ
తప్పటడుగుల నిడుచుంటి నప్పు డేను
వచ్చియును రాని మాటల ప్రాయమపుడు
దరికిదీసిరి నను వారు దయదలంచి
తల్లిదండ్రులు లేనట్టి పిల్ల యనియొ
ఒల్లె గట్టంగ నేరని పిల్ల యనియొ
మొల్లవలె నున్న దిది మంచిపిల్ల యనియొ
ఉల్లమున నన్ను విడువగా నొల్లమనియొ
మల్లెవలె సాకదొడగిరి యెల్లవారు.

నాకుగూడను అన్యులు లేకయునికి
తలలలోపలి నాలుకవలె మెలగుచు
వారు పలికించు పలుకులే పలుకుచుంటి
వారు నడిపించు నడకలే నడచుచుంటి.

కాల మొకకొంత యీరీతి గడచినంత
పదములందున నిలకడ కుదిరె కొంత

తనువునందు నొకించుక ప్రథిమ కలిగె
శైశవావస్థ పూర్తిగా జారిపోయి
అంగసౌష్ఠవ మింక నా కబ్బకుండె
సడలకుండుట బాల్యచాంచల్య మింక
ఇల్లువాకిళ్ళలో నుండ నొల్ల నెపుడు
గడపదాటి యెరుంగని కన్నెనయ్యు
త్రొక్కదొడగితి బజారు లొక్కొక్కపుడు.

మెల్లమెల్లగ నొక్కొక యిల్లునిల్లు
వాడవాడయు నూరూరు పల్లెపల్లె
పట్టణంబులు దిరుగుచు వచ్చివచ్చి
దేశమందు ననేక ప్రదేశములను
సంచరించుచు నేగెడి సమయమందు
చక్కనిది యంచు పలువురు చంకనిడిరి
వెక్కిరించిరి కొందరు వేడబముగ
పైనబడుట కనేకులు వచ్చుచుండ
మూపదూపపు కొందరు తొలగిచనిరి
బాగులోగులు తెలియని బాల నగుట
చేరదీసిన వారితో చేయిగలిపి
కడకుద్రోసినవారి క్రీగంట చూచి
మందలించినవారితో మాట గలిపి
కోపగించినవారిపై గొణుగుకొనుచు
పోవుచుంటిని నాదగు త్రోవ నేను.

అంత కొన్నాళ్ళ కేమని యనగవలయు
అగునుగాబోలు నయ్యది అపయ నాదు

వ్రాతమహీపుడె! కాకున్న పలనుపడునె ?
ఎంతయును నన్ను మున్ను మన్నించువారె
కాళ్ళఅప్పల చరిమిరి యూళ్ళనుండి
పగవకుంటిని అద్ది నా వ్రాతయనుచు
శిలలలోబడి జీవంబు నిలిపికొనుచు
వ్యాధినెఱుగని జీవసమాధినుండి
తెలుగువారల నోటిలోపల వెలుంగ
తెలుగువెలుగులు జగములోపల వెలుంగ
జపముసలుపుచు కాలంబు జరుపు చటుల
ఎన్నినాళులు గడిపితో యెఱుగ నిపుడు.

కాని చిరకాలవాసంబుకతన నాదు
పదము లిపుడును శిలలపై చెదరలేదు
స్మృతిపథమ్మున నిపు డవి ప్రతిఫలించు
పల్లియువారలు శోధింపవచ్చు వాని
అగును నయ్యవె నాదు ఛాయాపటములు
బోధపడు మీకు. మూముకగాథ లెల్ల !

కాలమది యెంత, ఆరీతి గడిపినానొ ?
ఐతి నాసన్నతరుణ రాజ్యాభిషిక్త
నంత నొకనాడు నాదు వృత్తాంత మరసి
ఆదరములేక అకట యిట్లయ్యెగాక
తథ్యముగ నిద్ది పైకిరాదగిన దనుచు
చెంతజేరిచె నను మృదుస్వాంతు డొకడు
జాలిగొనినాడొ, లేక నిజాల కతడు
పలుకుమార్దవ మరసి నన్ బ్రమసినాడొ

ఆరయగ నద్ది లోకోపకార మనియొ
ప్రేమతోడుత నన్నాదరింపదొడగె.

అక్షరాకృతియును, రూపలక్షణంబు
లన్నియును గని పెలవిచ్చె నన్ను జూచి
ఏల కృశియించి కృశియించి యేడ్చె దీవు
ప్రాణమిచ్చెను నీకు గీర్వాణయోష
కడుపుచల్లగ పిల్లల గన్నతల్లి
తద్భవంబవు, నీవును తత్సమంబ
వగుట, నగుదువు మాకును అమ్మ వీవు
అందుకొనుమమ్మ మామక వందనములు
తల్లికానుక యనుచు, చింతామణీ నిడె
చింత లెడబాసి నేను సుస్వాంతనైతి
పిదప నలుగురిలో నన్ను పెద్దసేయ
దలచి యాతడు కడు పట్టుదల వహించి
అంద రక్షరరమ్యత నాదరింప
పొంకముగ నాదు గాత్ర మలంకరించి
భాగమిప్పించె భారతభవనమందు.

అంతదానిని నన్ను తా నింతజేసె
నాకు కొడుకయ్యు, నన్నయ నాన్న నాకు
తక్క సంతానములలోన మిక్కుటముగ
లెక్కకెక్కినవా డొక్క తిక్కయజ్వ
పిదపబుట్టిన శ్రీనాథ పెద్దనాదు
లెవరిత్రోవల వారువా రేగినారు
అందఱికి కడగొట్టులౌ ఆధునికులు
వెదకుచున్నారు త్రోవలు వేలువేలు

## 2

అడుగునడుగున శంకలు పొడము నేడు
శంకితమె యయ్యె మామక జననకథయు.
అస్మదీయాభిజాత్యము ననుమతించు
వారు కొందరు, కాదని వాదుసలుపు
వార లొకకొందరయ్యు నవ్వారిగాగ
పోరుచున్నారు అందు నెవ్వాడుగూడ
బల్లగ్రుద్ది నిరూపించు బంటు లేడు.

తల్లిలేని యనాథయై ఉల్లమందు
తల్లడిల్లగవలెనె మీ తల్లిబాస !
భావమందున ఐక్యతబడసి దీని
త్వర పరిష్కార మొనరించి, తల్లి ఋణము
తీర్పగడగుడు తమతమ నేర్పుకొలది
వేసముల మార్పుచేత, నా బిడ్డ లనుచు
పోల్చుకొనలేకపోయితి మిమ్ము మొదట.
బాసలోపల నంతగా యూసలేమి
తెలియగలిగితి మీరలు తెలుగు లనుచు
వేషభాషలు రెంటిలో వేష మరయ
బాహిరమ్మయి జాతికి దేహమగును
ఆంతరంగికమయి ప్రాణవంతమగుట
భాష జాతికి జీవమై పరగుచుండు.
వేషములకేమి ? వేసవేల్ వేయవచ్చు
బాస వోయిన వచ్చునే పీసమేని ?

మఱచిపోయిన పదముల మరల దెలిసి
జారిపోయిన పదముల నేరికూర్చి

లుప్తపదజాలమును పునర్వ్యాప్తిచేసి
జానుతెనుగు పదమ్ముల చాయ లెరిగి
స్వీయభాషను లేని శాస్త్రీయశబ్ద
పరికరమ్ము సాంకేతిక వాచకములు
పారిభాషిక పదసృష్టి పరగజేసి
సంగ్రహింపుడు నూత్నకోశమ్ములందు.
తల్లిభాషను వెలయు సుద్గ్రంథ తతిని
అన్యభాషలలోనికి ననువదించి
అన్యభాషా ప్రసిద్ధ కావ్యస్రవంతి
తెలుగు వాఙ్మయజలధిలో దెచ్చి కలిపి
తెనుగు సారస్వతమును విస్తృతమొనర్చి
తెలుగు దుక్కుల క్రొత్త విత్తులను విత్తి
తెలుగు తోటల క్రొత్త యంటులను నాటి
తెలుగు తేరును క్రొత్త బాటలను నడిపి
తెలుగుతేనియ నూరూర తెగువ బంచి
తెలుగువాణిని ఇంటింట వెలయజేసి
దేశభాషలయందున తెలుగు లెస్స
యనెడి ప్రాబల్యము నిత్యమై యలరజేయు
భారమంతయు మీ భుజద్వయిని కలదు.

భాష మీయది, మీర లీభాషవారు
పాయరానిది యిరువురి బాంధవమ్ము
ఒకరి మంచియె మంచి యింకొకరి కరయ
ఒకరి చెడ్డయె చెడ్డ యింకొకరి కగును
కాన నాత్మీయ కల్యాణకాము లగుచు

అడుగుబెట్టుడు ముందుకు నడుముగట్టి
మాతృసేవకు మించిన మంచి గలదె
ఆరియులు మీరు భాషాకుమారులార !
శక్తిసామర్థ్యములపట్ల శంక వలదు
మీసమున్నది మూతిపై రోస మింత
తెచ్చుకొనునెడ సాధింపవచ్చు నన్ని
గాథ యిది, బాధ యిద్ది, ప్రబోధ మిద్ది
ఎంత చెప్పిన నా గాథ కంతులేదు
రోళ్లరోకళ్ల బాడినన్ నోళ్లె నొచ్చు.

# కుబేరుడు

చాలు ! కుబేరుడా ! క్షణికసంస్కృతి సౌఖ్యసుధాధునీతరం
గాలను దేలియాడుటలు, కాలము క్రిందుమీదులయ్యె, భో
గాలకు వేళగా దిది, వికావికలౌ మదిఁ జిక్కబట్టి, కెం
గేలను దానకంకణపు కింకిణి ఝుంకృతితోడ మేలుకో !

మంచిహొరంగుచేడియలు మాపులు రేపులు పాయకుండ, నిన్
గాంచుచు సేవలన్ సలుప కమ్మని పాసెము, లిబ్బిరాయ ! నీ
కుంచపు బొజ్జలో దొణకకుండగ నుండిన జాలునయ్య ! నీ
సంచిముడిన్ సడల్చి తగు సాయము సేయుము పేదసాదకున్.

చెలువకు నీకు పిల్లలకు ' శ్రీశుభమస్తు'ని పాటపాడి, కో
ర్కెలకు గులామువై యెపుడు కొండలు వాములుగా గడించి, డ
బ్బుల గని పొంగిపోయెదవు భోగపరాయణ ! పొట్టకూటికై
మలమలమాడు సోదరుల మాట దలంప విదేటి పాటియో !

మేలు ధనాఢ్యుడా ! భవదమేయవిరాగము డబ్బుపట్ల, లం
చాలకు, నాటకాలకును, జారవధూమణి జావళీలకున్
వేలకువే లొసంగెదవు వేడుకతో, పెరదిక్కులేక పా
దాలకు మ్రొక్కు పేద కిడ తావకహస్తము క్రిందుమీదగున్ !

అల్లదె ! నీదు వాకిటను " ఆకలి, ఆకలి, పట్టెడన్నమో
తల్లిరో ! మాకు బెట్టు, నిను దైవము బ్రోచును, తల్చుకొందు, నీ
పిల్లలు సేమముందు " రని పెల్లున నార్చె కుచేలు డౌర ! నీ
యుల్లము రాయియై కరగకున్నది, న్యాయమటో కుబేరుడా !

ఆయువు బొంది నుండగ సమార్జనజేసిన విత్త మెవ్వడేన్
కాయము మాయమై చితిని కట్టెల గాలెడునాడు నెత్తిపై
మోయునె మూటగట్టుకొని మూర్ఖమెకాక ! యిదిట్టులౌట రా
ధేయ దధీచి ముఖ్యులటు దీనుల బ్రోచుటె కీర్తి శ్రీనిధీ ?

' పేదల నేత్రుచుక్కలె, కుబేరు ఖజానల రత్నరాసులై
పాదుగ నిల్చియున్న ' వను పండితవాక్యము విస్మరించి, స
మ్మోదముతో భుజించు టది పుణ్యమొకో పురుషార్థమొక్కొ !
పేదల సాపెనల్ నిను తపింపకమాన వవెన్నినాళ్లకున్.

లే నడుమున్ బిగించి గతిలేమిని ' కో 'యనువారి గాంచి, నీ
యానన మింతవంచి, తను వశ్రుజలమ్ముల శుద్ధిజేసి, స్వా
ర్థానికి స్వస్తిచెప్పి, ధనధారల దన్ను సహోదరాళి, మో
క్షానికి రాజమార్గమిదె, జాగొనరింపకు మింక, శ్రీనిధీ !

'నాకు ధనమ్ము ధాన్యమును నాకు శుభ' మ్మని యెంతసేపు, నీ
షోకులె నీవుగాని, పెరజోలి రుచింప దొకింత నీకు, నీ
పోకలు లెన్నగావు, పరిపోషణసేయగ రమ్ము బీదలన్
నాకసుఖాల నందెదవు నా నుడి నిక్కముసుమ్ము శ్రీనిధీ !

మంచికి చెడ్డకున్ మఱి సమస్తశుభాశుభ కర్మసంచయా
భ్యంచిత కీర్త్యకీర్తులకు భారము నీతలనుంచు బీదలన్
కుంచితబుద్ధివై మిగుల గోడులపా లొనరించుచుందువే,
కంచెయె చేను మేయునెడ కావలి యింకెవరయ్య ? శ్రీనిధీ !

# అపశ్రుతి

ఎన్నడు మీటనట్టి శ్రవణేంద్రియ దారుణమౌ అపస్వరం
బిన్నడురేయి హాయిచెడ నేటికి మీటితి ? 'రామచక్కఁనౌ'
కిన్నర తంత్రులందు, పరికింపవౌ మీటుల, జీవసూత్రముల్
తిన్నగ గూర్పవైతొ, పెకలించితొ ! యే విపరీత తానముల్ !

కిన్నర చేతబూని కల గీతికలఁ మొలపించి మానసాల్
పెన్నపలెం గరంతువని వీనులు కోసికొనంగ, గూబలఁ
దన్నుచు దేశ్యప్రాక నపథమ్ముల ద్రొక్కఁతి ! నేర్చినావు నీ
వెన్నడు ? పాలు ద్రావి విషమెంతయు గ్రక్కెఁడు వింత చెయ్దముల్.

మున్నొకనాడు లోకములు మోహపు నిద్దుర మున్గి, పచ్చడాల్
తన్నుచు నిట్ట నీల్గి యుపలంబువలెం బడియుండి, యెంత లె
మ్మన్నను లేవకున్న, దరహాసముతో ప్రణవస్వరంబు నీ
కిన్నెర నూది యూది పలికించితి నించితి జీవనాదముల్.

నీ సరస స్వరమ్ముల ధ్వనించె శ్రుతుల్ వికసించె నంగుళీ
న్యాసమునన్ సమస్త భువనంబులు నీ కరచాలనంబునఁ
మోసులు మోసులై హృదయముల్ పులకించె, త్వదీయ కంఠ వి
న్యాసమునన్ రణించె ప్రణయ ప్రభవ ప్రవణ ప్రణాదముల్,

అసలే లోకము శోకమోహయుత హేయస్థానమఁమాట, ముఁ
పిసలైయున్న చటన్న నీవును విపంచీ పంచమస్థాయిలో
విసపుంబోకల బోవ జూచితి ! భవద్వీణాక్వణద్ఘోర ని
శ్వసనంబుల్ మసి సేయకున్నె, మునుపే పాడైన యీ లోకముఁ

కమ్మని పాట పాడి యురగమ్ముల లేపుము, జోఁపు మంతరం
గమ్ముల, నింద్రియమ్ముల సుఖమ్ములనుండి మరల్చి, స్వర్గ లో
కమ్ముల చాటి బ్రహ్మ పథకమ్ముల గ్రుమ్మరుదాక, ఊపులో
కమ్ముల జోలవాడి, నరకమ్ములుగూడ లయమ్ము పొందగన్.

ఇంపుగ గోట మీటి పలికింపుము వీణియ, తంత్రులందు గ
ల్పింపుము హాయి, రాయి కరగింపుము, నింపుము రాగముల్, సుతా
రింపుము తారమందు, సవరింపుము కంపము తళ్కు బెళ్కు లొ
ల్కింపుము, జంత్రమందు మథియింపుము రాగ రస ప్రవాహిముల్.

# చెరలో మొర

సీతమ్మ తల్లికి సిగపూలు సవరించు
చిట్టిరాఘవు మోము చిన్నబోవు
భక్తి నాతో రామభజన జేయుచు నాడు
బాలురు మది నెంతొ పరితపింత్రు
నా తోడునీడయై నను బాయ కెపుడుండు
అర్ధాంగి నోట నీరైన నిడదు
పూజకు వేళయ్యె పోదము రావోయి
రామదాసని పిల్చు రంధి మునుగు

ఇంట రాఘవా! నేను లేకుంట జేసి
ఇచట తానీష దోసీసు ఈయకుంత
ఆరులక్షల వరహాల నకటు యెట్లు
చేర్చి చెల్లింతు? గవ్వైన చేతలేదు.

నిన్ను పూజింపగా సన్నజాజులు బట్టు
పాణులందా? కాలు పలుగురాలు
నీ పాదముల మ్రోల నేప్రొద్దు మోడ్చెడి
కరములందా? అయఃకంకణములు
నీ యాలయంబుకే నిరతంబు దిరుగాడు
పాదద్వయంబుకా? బంధనంబు
నీ పాదపద్మాల నెత్తి నెత్తికి జేర్చు
వ్రేళ్ళయందా? ఉక్కుముళ్ళ పోటు

అక్కటా యిట్టిపని చెప్ప నలవిగాదు
పాపపుణ్యంబు లెరుగని పచ్చితురక
పెట్టు బాధలు ; వేలనై పిలుపుమంద
రాఘవా ! రామదాసుపై రాద కరుణ !

భద్రాచలమ్ములో బాగైన గుడికట్టి
మొన్నగా నీచేత మురుపు లిడితి
సీతమ్మ మెడ యెంతో చిన్నబోవుట జూచి
చింతాకు పతకమ్ము చేసి యిడితి
లక్ష్మన్నబాబుకు లలిత బాహుపులందు
బంగారు పిల్లమ్ము భక్తి నిడితి
పచ్చరాల్ దాపిన పటికంపు పాదుకల్
లలిమీర నీ పాదముల దొడిగితి

చేతిసొమ్మెల్ల యిట్లు నీ సేవకయ్యె
పట్టిచేతుల నున్న నన్నట్టి యితడు
ముప్పతిప్పల బెట్టుచు మురియుచుండ
మెచ్చుటా ! చూడ నీకు నా ముద్దుతండ్రి ?

విత్తమంతయు మ్రింగి విగ్రహాల్ చేయించె
'కాఫరు' వీడని కారులరచె
సర్కారువారితో సయ్యాటలా నీకు
చెల్లింపు దబ్బని చెంపగొట్టె
రాముడో గీముడో రాడుగా అడ్డంబు
పాలింప నిన్నని బందలెత్తె
ఆటలా మాటలా అడ్డు పెట్టగనీను
పైకమీయక యంచు బండె ద్రోచె

అన్న మెఱుగ నీళ్ళెఱుగను అయ్యో, తండ్రి.
నిద్దుర యెఱుంగ రాతిరి ప్రొద్దు తెఱుగ,
చిటిచీకటి చెరసాల కష్టపడగ
జానకీనాథ నాపైన జాలి రావ ?

సుఖముల్ దుఃఖములున్ జనావళికి నెచ్చో వచ్చుచుం బోవు ; భౌ
తిక దేహం బది నీటిబుగ్గ యనుచున్ దేవా ! భవన్నామ మెం
తయు ప్రేమన్ జపియించి మించు నను నీ తానీష గీనీషయా
అకటా బాధయి పెట్టజాలునది ! రామా ! బ్రోవరాకున్న నా
స్థిరమౌ శోకమటంచు వేడెదను రాజీవాక్ష నీ దాసుడన్.

# స్మృతి

ప్రేయసీ దూరదేశాన వేఱుబడిన
నా శ్రవమ్ముల నర్తించునాటి నీదు
మధుర మంజుల రావమ్ము మంద్రగతిని
నాగుబాము చెవిన్ వేణునాద మగుచు.

ఉబుసుపోకకు సాయాహ్న మూరవెడలి
ప్రకృతికన్యక పరచిన పచ్చకోక
చతికిలంబడి మది నెదో నణుగుకొనుచు
నున్నతర లేచె మనసులో నూహ లెన్నొ.

కోడె మాగున్న సందిట గునిసియాడు
లలిత మంజుల లతికాలలాము చూడ
మొదట హర్షమె పైపయి మోసులెత్తె
కాని యాపై నిరాశయే కలిగె హృదిని.

అడవిదారిని ఒంటిగా నరుగుతరిని
దూరమున కానుపించె నీ జారుజడలు
హస్తధృత సుమమాలినై యచట జేర
పాయలై త్రాచుపాములు ప్రాకిపోయె.

పండుటాకులు పచ్చసేవంతిపూలు
కారుమబ్బుల గనుపించి కరగిపోవు
మెరుపుతీవలు చారు చామీకరంబు
నింపు నాకంట నీమేని నిగ్గులు చెలి.

సొంపు తుమ్మెదచాలు నీలంపురాలు
ప్రావృడంభోధర వితర్ది బర్హిబర్హ
మసిత పక్షంత్యనిశ చూపు నతిప నీదు
త్రాలుగన్నుల వ్రాలు నుంగ్రాల కురుల.

ప్రణయ మసృణంబుతో మంజుభాషణముల
సశినికె బ్రియమ్ము సెప్పి పానకము నాని
కైపున మదించి కూనిరాగాలు దీయు
భృంగముల గాంచ నా మదియుం గలంగు.

ప్రాణిమయమైన విపుల విశ్వమ్మునందు
ప్రాణముల నిల్పు నను వొక వ్యక్తిమీద ;
దానికొఱకయి తన జన్మ ధారవోయు
సతిని కిహాసుఖ పరము నదియుఁజూపె !

# దివ్వెలపండుగ

చిన్నతనంబునుండియును చిత్రముగా నిను గాంచుచుంటి నే
నిన్నటిదాక, నేడు నిటు నిల్చితి పిల్చినలీల మ్రోల నో
పన్నెలమారి దివ్వియలపండుగ ! నీ యెలజవ్వనంబు తా
నున్నది యున్నటుల్ చెడకయుండగ నుండుట చోద్యమయ్యెడున్.

మెట్టిన మాసిపోవు తెలిమోమున కుంకుమబొట్టు పెట్టి నీ
కట్టిన పట్టుపుట్టము ధగద్ధగకాంతుల నొల్కబోయ కా
ల్మట్టెలు చిట్కుపొట్కుమని మంజులనాదము లీనుచుండగా
పట్టణవాసులన్ బలిమి పండుగ సేయుమటంచు వచ్చితే ?

చుట్టము వౌదుగాక విను సుందరి యెందును బిల్వకుండగా
నెట్టుకవచ్చి నేనిదిగొ నీ కొక చుట్టమనంచు బల్కుచున్
గట్టిగ తిష్టవేయు టది గౌరవ మౌనొకొ ! నీకు నెవ్వరేన్
బొట్టులు కాటుకల్ బొడిచి బొమ్మలపెండ్లికి కమ్మలంపిరో !

పప్పులు కూరగాయలును పండ్లు ఫలమ్ములు ఫల్లిగింజలున్
చప్పిడి రొట్టెముక్కలును జావయు నూకలు నూకబియ్యమున్
ఉప్పుడు బియ్యమున్ నమలి ఉప్పస ఊరటలేక ప్రాణముల్
గుప్పిటబట్టి మేము మన గుల్కుచు వచ్చితి వింతవిందవై.

ఎందుకుగాని కూడనుము నేప్పుచు మ్రింగగ రక్తహీనులై
మందులె విందులై జనులు మానము ప్రాణము లూనువేళలన్
సందులొ మందటంచు నిటు చంకలుగొట్టుచు వచ్చినావు నీ
చందము జూడ నించుక పసందనిపించదు భోగిపండుగా.

రోషముమాని నీమని విరోధము సూనక తెచ్చు వింతయుక్తా
స్టేషనులోన రైలుదిగి చేతుల సూపుచు నేగుదెంచితో
ఫ్యాషనుతోడ. లేక యది భావ్యము కాదని యెంచి వార్డులో
రాషను కూపనుం గొని సరాసరి వచ్చితొ భోగిపండుగా:

కట్టడి తప్పిపోవు నని క్రమ్మర వచ్చిన వచ్చినావు పో!
యిట్టులు నీవుగాని మది నింత విచారము లేక కొంగుకో
జెట్టిని దెచ్చినావు: మము 'ఛీ' యనిపించుటకేమొ, అల్లుడై
పట్టిగబోవునా యత డవంధ్యమనోరథు డమ్మ పండుగా!

కావడి దింపెనా యిపుడు 'కాముక' అల్లుని దోచితెచ్చి మా
చావడి, లోన నెంతటి 'హుషారు' మనిషివొ యమ్మ కొమ్మరో
తేవడి కాపురంబు మొదలేయిది. తాకటుపెట్టి తస్వునే
సేవెలు దెచ్చువార లొక చేతెడు చక్కెర కెంపు చత్తుమో ?

పిల్లలు జెల్ల లొక్కెడెన పీకుకతిందురు మందుగాల్పగా
చిల్లరడబ్బు లిమ్మనుచు. చీరలకోసము భార్యయొక్కతే
అల్లరిపెట్టు; నోముల మహోప్పటి యింటికె రంగుపూతలన్
అల్లునిదాడి బిడ్డ దొక యంగడి పండుగవన్ను నీవెపో!

ఎక్కడనో యొకానొక యహీనధనాఢ్యుని మేడముంగిటన్
చుక్కల పందిరుల్ భువికి చోద్యముతోడుత దింపినంతనే
నిక్కముగా సమస్తధరణీప్రజ హాయిగనున్నదంచు 'తై
తక్క తధోం తధో' మ్మనుచు దబ్బున దూకితె భోగిపండుగా!

పళ్ళెమునిండ పెంపియును బంగరు కాసులు రాశివోసి "మా
తల్లివిగాదు ర" మ్మని యువమ్మన కాళ్ళను వేళ్ళ మ్రొక్కి నిన్
పల్లకినుంచి మేననిడి పబ్బతిబట్టుచు గొల్చునట్టి యా
బల్లిదు లుండ మమ్ము గని పైబడి వచ్చెదవేల పండుగా!

వాటికే వాని గుప్తలకు గుండమును 'బహ్యా'లకు లొంగి వంగి మో
మాటము కోల్పియార్చి చెడి మ్రొక్కుచు త్రుక్కిన పేనుచందమై
నాటముహొద్ది పైష్టవుల పంక్తిని జేరుచు మారు చెట్టులో
పూటకుపూట గండముగ బుచ్చుచునుంట యెఱుంగవోకటా !

పదుమను లేమమున్ బసుగువారిమ శ్రీ భగవాను డెన్నడో
గమును నిజంబునన్ నరకు కంతవియాతన మాచరించి యీ
భువమికి శాంతిగూర్చె నను పూర్వపువార్తలు దెచ్చినా వహో !
పదనెద నిప్పుడున్ నరకులెందరొ యుండు విటం చెఱుంగవో !

న్యాయము ధర్మమున్ జని వినాయకు బొజ్జను మారి కానరా
వాయెను శాంతికాముకుల యత్నము లన్నియు గాలిమేడలై
పోయెను, దుష్టశక్తు లిల పూర్తిగ రేగెను, సృష్టిలోన న
న్యాయ మధర్మమున్ బలములై మనుసూత్రములయ్యె పండుగా !

శాంతి యహింసలున్ సమరసాధనలై విజయంబుగూర్చె త
చ్ఛాంతియహింసలే సకలసౌఖ్యము లౌనని చాటుచున్ మహా
మంతుని జేయబోవగ నమాంతము కోతిగ మారి సుప్రజా
హంతకులై నరుల్ నరుల నంతమొనర్చుట కానలేవొకో !

కోడలిమీద నత్తలకు కోపము సాజమె అత్తగారిపై
కోడలి కంతకంటె మరి కోపము కొండెడటన్న వింటిమా
వేడుక యౌను దోమ కట బిడ్డయు తల్లియు నుప్పునిప్పులా
పాడుదినాలలోన నొక పండుగనం చిటు వచ్చినావొకో !

పేదకుబోయినట్టి నిజపేదల చిన్నది యున్నదున్నటుల్
గూడెములోనికిన్ దిరిగి గొబ్బున వచ్చునొ ! లేక ఘోరమౌ
కీడును బొంది ప్రేతపతి గేహము సొచ్చునొ ! చెప్పరాని యీ
పాడుదినాలలోన నొక పండుగ నంచును వచ్చినావొకో !

విప్పిననోటిలో నరుల్ వేడుకతోడుత పంచదారయుఁ
పప్పులు పోతురో, బలిమి ప్రాణముదీయదలంచి భగ్గుమఁ
నిప్పులు పోతురో తెలియనేరని మారణదుర్దినాలలో
త్రిప్పుచు నేగుదెంచితివె దివ్వెలపండుగ నిందువేడుకఁ.

నే నేడాదికి నొక్కనాడిటుల సుస్నేహంబు పాటించిరాఁ
నోనాడెఁ నను నీత డిట్టులని యెన్నో రీతులఁ నీపదిం
బూనంబోకుము నీవుపోయినను అబ్బో! తిర్గి యేడాదికే
కా నీదర్శనభాగ్యమం చిటులు మా గాథల్ నివేదించితిఁ

ఆక్షేపించుటకాదు నిన్నిది, మదాంధ్యంబైన లోకంబునే
సాక్షాత్కారము సల్పుచేయగును, సస్యశ్యామలాఢ్యమ్మునై
నిక్షేపంబగు భారతావనిని తన్వీ వచ్చు నేడాదికో
గా క్షేమాఢ్య నొనర్చి వచ్చెదవుగాకఁ దివ్యదీపావళీ!

# వికృతి

చిరకాల ఘూకఘూసరి తాత్మమందిరాం
 తలుపులు తుడిచి చిత్తరువు లుంచి
చిరిత యాతాయాత నిష్ఠుర పదహతి
 పసచెడ్డ కడపల పసుపు పూసి
సతత బాల్యవినోద సక్తహాస్తాంకితా
 వరబాష్పత్త్రిక సుధావారి చిలికి
గళిత మాంగల్య దుర్గళసేమ లనబోలు
 ప్రాంగణమ్ముల రంగవల్లిక లిడి

ద్వారములయందు పచ్చని తోరణములు
కట్టి శుకపికశారికా కలకలముల
కంఠములు మేళవించి స్వాగతము లింపు
వచ్చి వాకిట నిలిచె సంవత్సరాది.

మావి పందెలువేసి సంబరము తెలిపె
చేదుగురిసెడి వేము పుష్పించి మించె
తింత్రిణీవృక్షములు పండి తియ్యనయ్యె
ఆంధ్రు లెద మెచ్చి పచ్చడు లారగింప.

శిశిరవాతోద్ధూత శీర్ణపర్ణాళియై
 మోడువారిన వృక్షములు చిగిర్చె
విగత పుష్పరజః ప్రవృత్తులై వెలసిన
 కొమ్మలు ప్రసవించి కొమరుగాంచె

వనవీధులందు మవ్వపు పువ్వు వెండిగి
　　న్నెలు తొల్కు తొలకి పన్నీరు చిలికె
పూర్వవాసన తెల్ల పుడికిపుచ్చుకొని గం
　　ధవహాంచు దిక్కులం దాడివెడలె

క్రము కలకంఠ భృంగ మంగళనినాద
వాద్యములు మ్రోసె ప్రకృతి యపారశోభ
గాంచి కళకళలాడుచు కానవచ్చి
వికృతి పేర ఉగాదియై వెలసె నేడు.

ప్రకృతి సర్వము 'వికృతి' సంపర్క మంది
పచ్చపచ్చగ కన్నుల పండు వయ్యె
మధుర కటూష్ణ మిశ్రనింబప్రసాద
భక్షణము సల్పి యుత్సాహపరులు కండు.

వికసిత సూనవాటికల పెచ్చని తేనియలాను షట్పద
ప్రకర నినాదముల్ చెవుల పండు వొనర్పగ మావిగున్నలన్
పికములు పంచమశ్రుతిని వేడుక బాడగ మెచ్చి వచ్చు నీ
'వికృతి 'ని గాంచి సిగ్గుపడి వీగె 'విరోధి ' నిశాతమస్సులన్.

పోయెడుగాక ! పాతబడి పోయిన కాల 'విరోధి' తోడనే
హేయములైన జాతిమత హేతుక ఘాతుక హేతువాదముల్
మాయపుకృత్యముల్ పనికిమాలిన బూటకనాటకంబులున్
చేయిని చేయిగల్పి పెరచేతను జేబులు పుణ్కు బేరముల్.

చాటు బజారు బేరము విషాదపు మారణహోమముల్ నిరా
ఘాటప్రవర్తనల్ కలియుగప్రళయం బొనరించుయుద్ధముల్
కాటకముల్ విచారకరకార్యము లాకలి కారుమంటలున్
నేటిదినమ్మునుండి యవనీస్థలి పీడి తొలంగిపోవుతన్.

దరిమలినుండి పొందెడి వ్యథల్ నశియించుత స్వార్థవాసనా
పరిలగపారి చిత్తములు పాపభయంబును బొందుగాక బా
హిరంగముగ సాగుచున్న నరహింసలు ధ్వంసములై ధరాస్థలిన్
స్థిరతర శాంతిమంతముగ జేసి ఉగాది శుభం బొనర్చుతన్.

తరతమ భావముల్ వికటతర్కములు నిల్కడలేని యూహలున్
విరసపుమాటలున్ కపటవేషము లుల్లములోనలేని ద
బ్బరియగు స్నేహముల్ మిడిసిపాటులు కోపము తాప మీర్ష్యయున్
పిరికితనమ్ము మమ్ములను వీడుత నీశుభవాసరమ్మునన్.

అచ్చపు దేశభక్తి కులమంచభిమానము జాతిసంపదన్
పెచ్చొనరించు సేవ తమ వేషమునందును భాషయందునన్
హెచ్చిన ప్రేమ సోదరుల హీనదశన్ గని బాష్పబిందువుల్
పుచ్చెడి మేల్గుణంబు లిల బొంపిరివోవునుగాక జాతిలో.

# నందన

మాసముమాసమై ఖరసమంబు క్రమంబుగ మాసిపోయె వి
విచ్చేసెను నందనాబ్దము కృశించిన మ్రోడు లిగిర్చి పుష్పసం
వాసితమై సువాసనల బర్వెను దిక్కుల నంత చూతముల్
వేసెను పూపపిందియలు వేములు గోముగ వహించె నెల్లెడన్.

నందన ! నీవు వచ్చినదినంబున పండువొనర్చి మాకు నా
నందము గూర్చి నెందు కభినందనముల్ గొను, మస్మదీయ దై
న్యందిన భావిజీవన వసంబది నందన మౌనటంచు మా
కందము లెక్కి పాడు కలకంఠవధూ మధుగీతి సార్థమా ?

నందన వచ్చెవచ్చె ననినఁ బరిమేనులు పుల్కరింపగా
క్రొంచలిరాకుకోకలను కొమ్మలు చుట్టి శిరమ్మునందు క
మ్మందన మీను నందపుసుమమ్ముల దండలు దాల్చె మెచ్చి యిం
దిందిర పాంథబాంధవులు తీయనితేనియ మోపులానగన్.

వికృతి విరోధియుఁ ఖరయు పీసము మానముచేసి సుప్రజా
పకృతి యొనర్చి జీవితముపై వెటకారపు నవ్వు రువ్వగా
వికృతములైన మా బ్రదుకు వీణియ తీవలు మేళవించి వి
ప్రకృతివిహీన మంగళరవమ్ముల మీటుము నందనాబ్దమా !

సంతసమైన యీ నవవసంత 'యుగాది' దినంబునందు నా
శాంతము లెల్ల శోభిలి సుహాససమన్వితమయ్యె నూత్న సి
ద్ధాంత ప్రజాప్రభుత్వ సువిధానము వర్తిలె రాష్ట్రమందు ఆ
శింతుమొకో ! ప్రశాంత సుఖజీవిత మింతటినుండి నందనా !

# మార్పు

మార్పు మారుపంచు పలుమారులు పేరులు మార్చిమార్చి యే
మారిచి పిల్చుమాత్రమున మార్పువచ్చునె తత్వమందు ? గో
మాతకి పేరుమార్చి సుకుమారి కుమారి యటంచు ముద్దుగా
కోరికమీర పిల్చినను గోవుల నెత్తురు పీల్చకుండునా ?

# పల్లె - కాపు

పూరిగుడిసెల పేద కాపురము లొప్ప
నడితరమువారు పెంకుటిండ్లను వసింత్రు
పెద్దరెడ్ల సంసారము మిద్దె టిండ్ల
ప్రబలుచుండును తరతమ భావములను.

ఆధునిక లోకమును క్రిందుమీదు సలిపి
చాల గర్వించు ప్రకృతిశాస్త్రజ్ఞ ప్రజ్ఞ
యందు జొరలేక పట్టణాలందె కులుక
బ్రహ్మ సృష్టించినయటులుండు పల్లెటూళ్ళు.

దూరశ్రవణ సుభాషణ
దూర సుదర్శన సుదూర దూరప్రయాణా
ధారము లాధునిక యుగపు
దారములగు యంత్రతతులు గనరా పచటన్.

ఛాయాగ్రాహక యంత్రము
లాయత బహిరంతరిం దియవ్రాత సుఖా
ప్యాయనములు గుణపాత ర
సాయనములు చలనచిత్రశాలలు సున్నల్.

ఓనువాజాలు మ్రోయవు వీనులందు
డోలు సన్నాయి జంట సమేళములును
తాష మార్ఫాలు కొమ్ముల ఘోషణములు
చావు పెండ్లిండ్ల డప్పుల చప్పుడు లట !

"టాటు" వాయియగేప్తు. మోటారుబండ్ల
హోరు వినరాదు "టక్కరు" మారిరాదు,
పుసుకుప్పుసుకను దిగబడు నిసుకబడుల
ఘల్లుఘల్లను గజ్జెల కచ్చడములె.

మక్కపొడుపునలేచి గూడెక్కి నిక్కి
"క్కొక్కొరోకో" యనుచు నాయు కోడిపుంజు
మేలుకొల్పుకే మేల్కొల్పు మాలివారి
సమయము చెవిపోని "నడగడియారి" మగుచు.

ప్రొద్దునలేచి పాల్పితికి పొంగుబాదేరెడి దుత్త కాపుతే
ముద్దియచేతికిచ్చి నిజమూర్తిమునందున పాగదిద్ది బల్
ముద్దుగ నాగలిన్ తిసను మూపున దాలిచి పంటకాపు జో
డెద్దుల దోలుకొంచు పయనించు పొలాలతలాల దారులన్.

ప్రొద్దుపొడుచు కృషీవలు ముద్దునుదుట
నస్తమించును నాతని మస్తమునను
పొలముపొంతనె కాపుల నిలయములగు
నిలయ మతనికి రాతిరి నిదురకొలకె.

ములుకోలన్ ధరియించి కేల హలమున్ మూంజేత గీలించి, చె
మ్మటలలో కాయ పొలాలలోన నిడి యోర్పు న్నేర్పు సంధిల్ల నె
ద్దులకున్ బుద్ధులుసెప్పుచున్ హృదయ సంతోషంబు దీపింప స
త్ఫలకాంక్షన్ మడిదున్ను కాపుకు నమోవాకంబు లాశించెదన్.

అన్నగతప్రాణులు నరు
లన్నము భూదేవిగర్భమందు సుగుప్తం
బెన్నగ దానిని పునరు
త్పన్నం బొనరించి కాపు ప్రజ పోషించున్.

# సెలయేరు

కనుమేపుమారాన కనుపించు నాకోన
నల్లనౌ తల కొంత నరిసి పండినదేమొ.
నరిపుగా దది నల్ల నల్లనౌ తలమీద
తెల్లమల్లి రుమాలు తీరేమొ కనిపించు.

మల్లిపాగాలోని మలకలవి యొకకొన్ని
చెదరి గాలికి చాల చెలరేగె ననిపించు
కాదు నల్లనిరాతి కంబళంబున మావి
మేకిపోసిన రాశి యేకమైనటులుండె!

పైనున్న యారాశి పాలసంద్ర మటంచు
నాగుపాములు కొన్ని నడయాడు నేటులుండె:
నెత్తిగా దది కొండ నెత్తమ్మొ యగునుమ్మొ
నరపుగా దది మంచు టొరపు పరుపగుగాని!

మల్లిపాగాగాదు మఱి మావియునుగాదు
నడయాడు నిడుపాటి నాగు బాములు కావు
కొండనెత్తమునుండి రెండు మూడుగ జీలి
జలజలం బ్రవహించు సెలయేరు లగుగాని

## 2

కొండపై వారెవహా వెండికరిగిన నీరు
కుండలో గుప్పుమని క్రుమ్మరించిన భాతి;
స్వర్ధునీ వీచికల జల్లులాడెడు కరుల్
తొండాలతో ముంచి తూరుపెత్తిన రీతి;

పచ్చిమంచు ద్రవించి వచ్చునెడ దానితో
కలిసిపారె ననంగు గాత్రంపు బూదియన;
మంచు కొలకుల తానమాడి లేచిన దివ్య
పాకకామిని యార్ద్ర వసనాంచల మనంగ;
వేయికన్నుల ఱెప్ప వేయకే సురరాజు
పదిలపరచెడి సుధాభాండంబు దొరలెనన;
తళతళ త్తళతళ త్తళతళ త్కాంతితో
జలజలఝ జలజలఝ సెలయేరు ప్రవహించు.

3

ఉత్తుంగశిఖరమ్మునుండి యిటు పయనమై
ఆడాడ పల్లమ్ములం దెగిరిపడి దూకి,
పలకలై మెలివడుచు మఱల విడివడి సుడులు
తిరుగుచును పొరలుచును నురుగులయి పరుగిడుచు,
బండి గుండులు కొన్ని పిండిగొట్టుచు నంత
చెలరేగి గుండ్రాళ్ళ చెండ్లాట లాడుచును,
పచ్చిముత్తెపు సేసప్రాల జల్లులతోడ
తను తొంగిచూచు భానుని పూజలను సలిపి,
సూర్యుడును చంద్రుడును చుక్కలన్నియుగూడి
మోసులెత్తిన క్రొత్త మోహంపు మైకాన
పవలు రాత్రియు వెంట పరువులెత్తుచు నుంట
అందరిని తనయందు ఐక్యమొనరించుకొని
జలజలా జలజలా జలజలధ్వనులతో
తలపొలమ్ములలోకి తా దూరె సెలయేరు.

## 4

సానువుల శిఖరాళితో నేకమొనరించి
ఆసుబోసినరీతి నటునిటుం దిరుగాడి,

పాదరసపుం గుండ పగిలిపారె ననంగ
మరకతపు పచ్చికల మళ్ళలోపలమూరి,

నికటస్థలములెల్ల నిగనిగన్నిగలాడి
చూచువారల కనుల దోచుకొను నటుజేసి,

పంటచేడియ ఆకుపచ్చకోక పయంట
ముత్తెంపు జలతారు మురువు పోతలుపోసి,

దోరపూవులు కొన్ని దోసిళ్ళ గోసికొని
పరిమళము మైనిండ పట్టించుకొని లేచి,

దారి కడ్డుగనున్న తరులమూలము లొరసి
పక్వఫలముల పుడమి పడరాలగా గొట్టి,

ఫలరసాస్వాదనన్ బల మెసక మెసకగా
పూలసొమ్ముల నొడల్ భూషించుకొని మురిసి.

కలనాదముల నెడద పులకితం బగుమండ
నలుదెసలు వెలుగ చిరునగవు చూపులు విసరి .

ఎందుజూచినగాని యెదు రెవ్వరునులేక
యిచ్ఛా విహారమ్ము నిటు కొంతతరి సల్పి,

చిటిపొటి నడల హరు సికవోలె నపుడేగి
చంద్రికాకాంతి వాసకసజ్జ పోలికను

చెలిమితో ప్రకృతి సజ్జితముచేసిన మిసిమి
యిసుకపాన్పుల బవళించె నా సెలయేరు.

# వర్షాభ్రము

ఈ నీలజీమూత
మింత బలిసినదేమి ?
త్రాగివచ్చిన పగిది
తందనాలాడేని !

సాటి మబ్బుల జూచి
మాటమాటకు కేరి
జగడాలమారియై
జబ్బజఱచేని !

ఉబ్బు పట్టగలేక
తబ్బిబ్బు పడియేని
బెబ్బులిలె భీతిల్ల
బొబ్బరించేని !

అల్ల ధనపతి ముల్లె
కొల్లగొట్టినదేమొ !
బంగారు తీగెలే
పాఱవేసేని !

తన ఘనమునమ్ములో
త్యాగమ్ము పొంగెనో
స్ఫటికాలె భూమిపై
పాఱజల్లేని !

గాలిదేవునిమీద
కసిదీర్చుకొననేమొ
ఏడురంగుల చాప
మెక్కు బెట్టెని!

కొండ లాకారాన
నిండ తనుబోలెనో
దండి బాణముల మీది
నుండి రువ్వెని.

ఉప్పునీరము త్రావి
ఒకిళ్ళు పుట్టెనో
గుప్పుగుప్పున జలము
క్రుమ్మరించేని!

# కోకిల

ఈ వసంతదినాంత
మెంతసేపో లేదు
కోయిలా గొంతెత్తి
కొసరి కూయవదేల ? ॥ఈ॥

కమలినీగన్ధ సం
గత క్రమవాసనల్
గమనగోచరమూర్తి
గంధవహుడు హరించె ॥ఈ॥

పూలకొమ్మల ప్రాలి
పాలతేనెలు గ్రోలి
తుమ్మెదలు 'ఝుం ఝుం' ర
వమ్ములను క్రమ్మరెను ॥ఈ॥

సుమపరాగార్ద్రి ప్రియ
సుకుమార గల్లముల
భ్రమరరాజులు పత్ర
భంగములు విలిఖించె ॥ఈ॥

నలుపేమి తెలుపేమి
నాణెముండిన చోట
నలుపు లెన్నెడి మోమె
నల్లబారునుగాని ॥ఈ॥

ఒగరు చిగురులె మేసి
ఒకరి జోలికె పోక

ఒరులకొఱ కమృతమ్ము
లొలుకబోయుమ రెవరు?   ॥ఈ॥

అల్లదో సహకార
పల్లవావళి 'కుహూ
కుహూ' లేమి పండి యా
కులపాటు గాంచెడిని   ॥ఈ॥

ఏడాది కొకమాఱు
ఏనాడు వత్తువో!
చూడ నువ్విళ్ళూర
జాడ లేనే లేవు   ॥ఈ॥

పెగ్గెలకు నిన్నెవడొ
'బొగ్గు రామచిలుక'
అన్నమాటకె యింత
అభిమానపడవలెనె?   ॥ఈ॥

నల్లదనమున కెవను
తల్లడిలనేల? జా
బిల్లి గాడో శివుని
మల్లెపూవుల దంత   ॥ఈ॥

# నవోదయం

తెలుగు వాకిళ్ళలో
తొలికోడి కూసింది
తెలుగుకన్నియ తలుపు
తెఱచి చూసింది.

చిమ్మచీకటి రాత్రి
శిథిలమై పోయింది
తూర్పువాకిట మరల
తొలిప్రొద్దు పొడిచింది.

వేడివెచ్చని వెలుగు
వేయికరముల తెలం
గాణ మాగాణముల
కౌగిలించింది.

కలువ కనుమూసింది
కమలమ్మ మురిసింది
గాలి ఈలలువేసి
కమ్మగా పాడింది.

కన్నెతీవియ నాట్య
కౌశలము చూపింది
పూలబాలిక మధువు
పుక్కిలించింది.

మావిగున్న మదించి
తావి గుప్పించింది
గండుకోయిల మధుర
గళము విప్పింది.

గతదినమ్ములలోని
కతలన్ని చెప్పింది
భావికాలములోని
భాగ్యమును పొగడింది.

# ఏమి ?

అజ్ఞాన తిమిరమ్ము
లావరించె నిదేమి ?
విజ్ఞాన దీపమ్ము
వెలుగు లేమైపోయె ?

ప్రజ్ఞాలవము పంచ
బంగాళ మెట్లయ్యె ?
సుజ్ఞాననిధి! నీవె
సూచింపవలె తండ్రి !

ఎండమావులలోన
ఎక్కడి తుఫానులివి ?
కొండగుహలోన సుడి
గుండము లవెక్కడివి ?

పాలవెల్లువలోన
నీలివన్నె లివేమి ?
గరుడపక్షికి పాము
కాటు బాధ లివేమి ?

గంగాస్రవంతిలో
క్షార మెవ్వడు గలిపె ?
రత్నగర్భములోన
రాళ్ళుపడియె నివెట్లు ?

ఉండియుండీ నాదు
గుండె లేమైపోయె ?
మాయ లెరుగని మనసు
మాయ మెట్లైపోయె ?

# మేల్కొలుపు

పాలుద్రావెడు పూవ పాపప్రాయమ్ము
పొత్తిగుడ్డలలోన పొరలాడ గడచె
బాల్యమంతయు ఆటపాటలనె నడచె
ఏమిరా ! కన్ను లింకెపుడు తెఱచెదవు ?

తలసూపెనో లేదో మొలకజవ్వనము
ప్రొద్దెల్ల పోకిరి పోకలే పోయె
పడుచుచేతల నేగి "పహిలపచ్చీసు"
ఏమిరా ! కన్ను లింకెపుడు తెఱచెదవు ?

ఇల్లాలితో వచ్చె ఇల్లు కాపురము
పిల్లజెల్లల జింజు పెరిగె దినదినము
మెల్లమెల్లగ తలయు తెల్లబడసాగె
ఏమిరా ! కన్ను లింకెపుడు తెఱచెదవు ?

ఆకొన్న నోళ్ళముందరి ఆకు లెన్నొ
తీసితివి నీకడుపు తెగనింప దలచి
భిక్షుకుని జోలె యా కుక్షి నిండదురా
ఏమిరా ! కన్ను లింకెపుడు తెఱచెదవు ?

నిండు సంసారాలు నీరుచేసితివి,
పండువం టిండ్లదీపములు నింపితివి,
వెలిగెనా ? నీ దివ్వె మలిగెనేకాని
ఏమిరా ! కన్ను లింకెపుడు తెఱచెదవు ?

రేకువిచ్చని పూలు రిల్లివేసితివి
ఒగరు కాయలమీద షగదీర్చుకొంటి
నోచు చేదేకాని తీరునే కోర్కి ?
ఏమిరా ! కన్ను లింకెపుడు తెఱచెదవు ?

పాహి యని పాదాల పడిన ప్రాణాల
నెల్లద్రావితివి పుక్కిళ్ళ దొల్లలతో
మించెనేకాని శాంతించెనే దప్పి
ఏమిరా ! కన్ను లింకెపుడు తెఱచెదవు ?

చేటలో బడిననాటికి నేటికేని
తలయెత్తి చెప్పుకోదగిన పని యొకటి
కావించి పాపమ్ము కట్టుకోలేదు
ఏమిరా ! కన్ను లింకెపుడు తెఱచెదవు ?

తల్లిదండ్రుల ఋణము చెల్లించినావా
తల్లిబాసను పద్దె మల్లగలిగితివా
తల్లిభూమికి తనువు ధారవోసితివా
ఏమిరా ! కన్ను లింకెపుడు తెఱచెదవు ?

# యౌవనానందం

బ్రతుకులో నేముందిరా
సోదరా
బాగుగా యోచింపరా సోదరా

మన జీవితావధి సు
మారు నూరేండ్లన్న
మాట నీళులమూటరా!
సోదరా!
మనసులో చింతింపరా!

బాల్య వార్ధక్యములు
బరువు కుండలు రెండు
పరుల భుజములమీద
పడి దొరలి చనుచుంటు
వానిలో నేముందిరా
సోదరా!
వట్టి దండుగపాలురా!
సోదరా!

కౌమారదశ యెల్ల
కాలుకాలిన పిల్లి
అటుగాక యిటుకాక
అర్థహీన మ్మగును
ఉడికి ఉడకని యన్నమా!
సోదరా!
నడుమంతరపు బేరమా!
సోదరా!

యౌవనమె జీవితపు
యావత్తు ప్రాయమ్మొ
జవ్వనమె బ్రతుకులో
మవ్వంపు నిగ్గురా
యౌవ్వనమె జీవితమురా !
సోదరా !
జీవితమె యౌవనమురా ?

యౌవనమె జీవిత మ
హావృక్ష ఫలమురా
యౌవనమె జీవితమ
హాయజ్ఞ ఫలమురా
పడుచుదనమే బ్రదుకురా !
సోదరా !
బ్రదుకె పడుచుందనమురా !

పడుచుదనమే బ్రదుకు
పరువంపు దినమురా
పడుచుదనమే బ్రదుకు
పంటపొలమగురా.

జవ్వనమె జీవితపు
సంవత్సరాదిరా !
జవ్వనమె జీవితపు
పువ్వుల వసంతమ్మొ !

యౌవనమె సుందరము
యౌవనమె నందనము

యౌవనమె జీవితమ
హాబ్ధి మంధరము.
యౌవనమె స్వర్గమ్మ
యౌవనమె మోక్షమ్మ !
నిత్య యౌవనముతో
నీవు జీవింపరా !
నిస్తులానందమే
నీవు కామింపరా !
యౌవనమె జీవితమురా !
సోదరా !
జీవితమె యౌవనమురా !

# మతము

దేవు డంటే యెవరొ
దైవ మంటే యేమొ
తేటతెల్లముగాక
తెలియనే లేముగా.

తెలియ వాటముగాని
దేవదేవుని పేర
తెల్లనుచు నల్లనుచు
దెబ్బలాటెందుకో !

దేవుడే తెలియ డన
దేవునికి కొడుకెవడొ ?
మొదలె మోక్షము లేదు
కొడుకు గోవిందు డట !

దేవు డుండే జాడ
తెలుపుటకె మతము లన
మతములకు లోకాల
మర్యాద లేమెఱుక ?

రాజకీయా ల్మింట
రాణిల్లు నేపాటి
మతములకు మన యింట
మటి విలువ ఆపాటి.

దేశాలు విడిచిననె
దేవదేవుడు దొరుకు;

దేశాల పోరులో
దేవు డెందుకు సతుమ !

పారలౌకిక సుఖ వి
చారమో మత మనగ,
నోరుపట్టక కూయు
కారుకూతలు మతమొ ?

శాంత్యహింసల కొరకె
స్థాపింపబడె మతము,
మతము పేరెత్తి యీ
మనుజహింస సెందుకో !

మానసిక తిమిరముల
మాపునది మతము అగు
మనసు చీకటి సేయు
మతము లవి తమము లగు.

# ఊరడింపు

జోడుబాసిన రామచిలుకా !
గోడుగోడున దుఃఖమాపుము
జాడ లరయుచు తిరుగుచును నీ
నీడ గని విలపింప నేమగు ?

ఏడువకు చిలుకా !

కన్నుల
వేడినీ రొలుక.

దాడిమీఫల బీజములు నీ
జోడుతో విందారగింపగ
చూడజాలక లుబ్ధ జాల్ముడు
వాడి శరముల దీసె నుసురులు

ఏడువకు చిలుకా !

కలిసికొంటిరి కర్మవశమున
కాలవశమున వీడిపోతిరి
కలయుటకు విడిపోవుటకు గల
కారణమ్మౌ ఋణానుబంధము

ఏడువకు చిలుకా !

అందమగు నీ కనుల నశ్రులు
చిందగా నే చూడజాలను
డెందమున గల దుఃఖ మెటులో
డిందుపఱచి రవంత నేరము

ఏడువకు చిలుకా !

లోకమందున కష్టసుఖములు
నీకెకా దెల్లరకు చూడగ
చీకటుల వెన్నెలల రాత్రుల
పీక వచ్చుచు పోవుచుండును
ఏడువకు చిలుకా!

కష్టములు కలకాల ముండవు
ఇష్టసుఖములు నశ్వరములు, య
థేష్టముగ చను కాలచక్రో
ద్దిష్టగమనము నాపజాలము;
ఏడువకు చిలుకా!

అన్నపానీయములు ముట్టక
వన్నెచెడె సుకుమారదేహము
కన్నుకొలుకుల నీరుపెట్టుట
చిన్నబోయెను వదనబింబము
ఏడువకు చిలుకా!

సంతతము నెలుగెత్తి యేడ్చుట
గొంతు బొంగురుపోయె పాపము!
ఎంతయేడిచి యేమిలాభ మొ
కింత యూరట గనుము మదిలో
ఏడువకు చిలుకా!

దిక్కులన్నియు నిక్కి చూచెదు
ఎక్కడను నా కెవరు లేరని
వెక్కివెక్కుటు లేడ్చె దేటికి?
దిక్కు దేవుం డొక్క డుండగ
ఏడువకు చిలుకా!

చిలుక నీ వచనామృతము చెవి
చిలుకు దను పేరాసతోడుత
నిలిపి నీ రూపము మనమ్మున
నలుపుచుంటిని జీవయాత్రను
ఏడువకు చిలుకా !

అందములు చిందేటి నీ వద
నారవిందము గాంతు నని నా
డెందమున నువ్విళ్లూరుచు
బొందిలో ప్రాణాలు నిలిపితి
ఏడువకు చిలుకా !

నీదు ఖేదము ఖేదముగ గని
నీదు మోదము మోద మనుకొని
సాదరమ్మున నిన్ను గనుగొను
పేదజీవి యొకండు గలడని
ఏడువకు చిలుకా !

శోకముండదు కష్టకాలము
రాకమానవు మంచిదినములు
లోకమున నోపికగలారికి
శోకములు క్షణభంగురమ్ములు
ఏడువకు చిలుకా !

మాట లేటికి పెక్కులిక మొగ
మాటపడ కొక మాట జెప్పెద
నాటుకొంటిని పొలములో నొక
తోట నయనానందకరముగ
ఏడువకు చిలుకా !

చేతమున కడు శ్రద్ధగైకొని
ప్రీతితో పోషింపుచుండగ
లేతవయసు గతించి యిప్పు డది
కాతకారను దరిసియున్నది
ఏడువకు చిలుకా !

నా యదృష్టము మంచిదేనియు
నాదు తోట ఫలించునేనియు
తోటలోపల నీకు వలసిన
చోటొసంగెద శాశ్వతమ్ముగ
ఏడువకు చిలుకా !

ఇంక నీ కణుమాత్ర మేనియు
సందియము లేకుండెనేనియు
ముందు శుభసమయమున నే నీ
కందజేసెద వర్తమానము
ఏడువకు చిలుకా !

తీవియల ఉయ్యాలలూగుచు
పూవిగున్నలమీద వ్రాలుచు
తీవరమ్మున గగనమున స్వే
చ్ఛా విహారమ్ముల సుఖించెదు
ఏడువకు చిలుకా !

ఏండ్లుపూండ్లుగ గుడుచు నీ కడ
గండ్లు విస్మరియించి వనమున
పండ్లు ఫలములు మెసవుచును పొద
రిండ్ల దాగుడుమూతలాడుదు
ఏడువకు చిలుకా !

ఆకుపచ్చనివన్నె ఈకలు
మాకనుల కడు మోసగింపఁగ
ఆకుమఱుగున దాగి దశదిశ
లేకమయి నినదింప హాయిగ

పాడవే చిలుకా!
ముదమున
ఆడవే చిలుకా!

---

# సేతుశీతనగాళి

సేతుశీతనగాళి మధ్యో
ర్వీతల మ్మీ భరతఖండము
భూతలమ్మున వీరపురుషుల
పుట్టినిల్లుకదా !

భారత
భూమి యిదియెకదా !

ముందు మనదేశమున బుట్టిరి
ఎందరో వీరాధివీరులు
కత్తులను నెత్తురుల గడిగిన
కడిది యుద్ధవిశారదుల్ :

శాతవాహన చక్రవర్తుల
శాతకరవాలగముల ధారలు
పల్లవుల చాణక్యవీరుల
బల్లెముల పోటుల్.

కయ్యములతో కాకదీరిన
కాకతీయుల కఱకుకత్తులు
కృష్ణరాయల, దోఃప్రతాపో
త్కృష్టపౌరుషమున్;
పేరువడసిన వీరబొబ్బిలి
పౌరుషాంకిత వీరగాథలు
భారతావని తొలుతనుండియు
వీరభువి యని చాటుగా !

నాటి పలనాటుల చరిత్రము
మేటి బ్రహ్మణ బాలచంద్రులు
బోటి నాయకురాలి మగటిమి
బూటకములొక్కో !

కనుగొన
నేటి వగునొక్కో !

పేరుపేర గణింపదలచిన
వీరు లిట కోటాను కోటులు
భారతగ్రంథములు లక్షలు
బయలు దేరుగదా !

వ్యాసులు
బయటబడుదురుగా !

శౌర్య మీభువి పొంగె భుగభుగ
వీర్య మిట తళుకొత్తె నిగనిగ
ధైర్యకవచము వెలిగె ధగధగ
ధరణి దశదిశలన్

భారత
ధరణి దశదిశలన్.

ఇట జనించిన స్త్రీలు పురుషులు
వటువులును వృద్ధులును నెల్లరు
పటుతర ప్రథనముల పెనగిన
బంటుమగలుగదా !

మన తొ
ల్లింటివారు సదా.

# వస్తున్నాం!

వస్తున్నాం వస్తున్నాం
నవనాగరక ప్రపంచపు
నవయుగ నవయువకులం
ప్రస్తుత విద్యార్థులం
భవిష్యత్తు నాయకులం
వస్తున్నాం వస్తున్నాం.

లేస్తున్నాం
గబగబ కడి
గేస్తున్నాం
కాఫీ పడ
బోస్తున్నాం
పుస్తకాలు
మోస్తున్నాం
పుటపుట తిర
గేస్తున్నాం
సరసర చది
వేస్తున్నాం
చూస్తున్నాం
రాస్తున్నాం
వస్తున్నాం వస్తున్నాం.

పరీక్ష లి
ఖ్ఛేస్తున్నాం

పబ్లిక్ గా
　　ట్రేస్తున్నాం
పట్వాల్ సా
　　ధిస్తున్నాం
సామంతో నెగ్గకుంటె
　　సమ్మెలు
సాగిస్తున్నాం
　　　　　　వస్తున్నాం వస్తున్నాం.

స్వరాజ్యం వచ్చిందని
స్వాతంత్ర్యం తెచ్చిందని
చదువులలో ఏముందని
చదువులు వదిలేస్తున్నాం
కొంటున్నాం పత్రిక, కను
గొంటున్నాం ప్రకటన, తె
మ్మంటున్నాం ఉద్యోగం
ఇస్తే గైకొంటున్నాం
ఈకుంటే ఉంటున్నాం అంటున్నాం
　　　　　　వస్తున్నాం వస్తున్నాం.

సేవే మానవధర్మం
సేవే జీవనమర్మం
ఐనప్పుడు ఇంకేం మరి ?
అబ్బిన ప్రభుత్వసేవ
అబ్బకున్న ప్రజాసేవ
చేస్తున్నాం రోజులు గడి
పేస్తున్నాం మేస్తున్నాం
　　　　　　వస్తున్నాం వస్తున్నాం.

సూటు బూటు
కోటు హాటు
చూరుకు తగి
లిస్తున్నాం
ఖద్దరు ధోవతి కట్టి
ఖద్దరు లాల్చి తొడిగి
ఖద్దరు టోపీ లోపల
క్రాపింగులు దాస్తున్నాం
కాలికి చెప్పులు తొడిగి
గాలికి వదిలేస్తున్నాం
కళ్లు చేతి కిస్తున్నాం
కాలు బయట వేస్తున్నాం
వస్తున్నాం వస్తున్నాం.

కుళ్ళంతా లోలోపల
ముల్లెగట్టి దాస్తున్నాం
తెల్లని దుస్తులు గట్టి
తెరమీద నటిస్తున్నాం
వేలకొలది కేకలతో
వేదిక నలంకరిస్తూ
వేనవేలు మూకలతో
వెనకముందు చూడకుండ
ఎవరికి వంచని తలను
" మాల "కు వంచేస్తున్నాం
చప్పట్లు సహిస్తున్నాం
సరసులవలె చూస్తున్నాం

మెడలోపల బడ్డ మాల
మిలమిలమని మెరుస్తున్నా
కమ్మనిపూవుల వాసన
ఘుమఘుమ వ్యాపిస్తున్నా
చండమీది వ్యామోహం
తటపట లాడిస్తున్నా
చబ్బున తీసేస్తున్నాం
చౌడలు ఆడిస్తున్నాం
దబదబ వాగేస్తున్నాం
లెక్చరు దంచేస్తున్నాం
చప్పట లాశిస్తున్నాం
సంతోషం తెలుపుతున్నాం
వస్తున్నాం వస్తున్నాం.

అంతరాత్మ కాదన్నా
ఎంతమంది ఏమన్నా
మీ సేవకె మాబ్రతుకని
మీ బ్రతుకే మాబ్రతుకని
మిటమిట చూసేస్తున్నాం.
చేయని ధర్మా లెన్నో
చేయని త్యాగా లెన్నో
చేసినట్లు చెప్పనట్లు
చప్పున చెప్పేస్తున్నాం
ప్రజల కష్టాలకు మా
ప్రాణ మెగిరిపోతుందని
ప్రజల సుఖాల కోసం
ప్రాణం బలిచేస్తామని

వాగ్దానా లిస్తున్నాం
ప్రజల మెప్పు కంటున్నాం
వస్తున్నాం వస్తున్నాం.

చందాలు విరాళాలతో
సంచులు నింపేస్తున్నాం
చందా లిచ్చినవారల
వందివలె నుతిస్తున్నాం
వహ్వా అని అంటున్నాం
వసూల్ సరిగ చేస్తున్నాం
లెక్కలేమొ వ్రాస్తున్నాం
బుక్కలేమొ పోస్తున్నాం
ప్రజాసేవ చేస్తున్నాం
వస్తున్నాం వస్తున్నాం.

పరాయిలము కాముగదా
ప్రజల్లోనివారిముకదా!
ప్రజలకు మాకు భేదం మరి
పాటించుట లేదుగదా!
ప్రజాసేవే మా సేవగు
మా సేవే ప్రజాసేవగు
కల్లలతో మా కేంపని?
అల్లరితో మా కెందుకు?
కపటవర్తనకు మా కేం
గ్రహచారం పట్టిందా?
జ్ఞాపక మున్నదొ లేదో
మా ప్రతిజ్ఞ మీ కిప్పుడు

మా ప్రతిజ్ఞలో మాటలు
మరచిపోక మీరుంటే
మా నడతలు మీ కెందుకు
మనసుల నొప్పిస్తున్నాయి ?
మా మాటలు గమనింపుడు
మరల చెప్పివేస్తున్నాం
అందులోని అర్థాలను
అక్షరాల చేస్తున్నాం
" ప్రజల సుఖదుఃఖాలను
పంచుకొందు " మని యంటిమి
క్రమభంగం కాకుండా
కార్యం సాగిస్తున్నాం
ప్రజల సుఖాల్లో ముందుగ
పాలు పంచుకొంటున్నాం
వినోదాలు చేస్తున్నాం
విందు లనుభవిస్తున్నాం
అందలాలలో ఎక్కి
అంతటా తిరుగుతున్నాం
ఈజన్మంలో సుఖముల
ఇట్లు పంచుకొంటున్నాం
ముందు జన్మలో దుఃఖాల్
అంది పంచుకోగల మని
ఆత్మసాక్షిగా ఇదిగో
హామీ మీ కిస్తున్నాం

ఆచరించి చూపువాడె
ఆచార్యం డను పూర్వపు
ఆచారం విని పెద్దల
ఆజ్ఞల పాలిస్తున్నాం

వస్తున్నాం వస్తున్నాం.

వస్తున్నాం మీవలెనే
చస్తున్నాం బాధ లనుభ
విస్తున్నాం మీవలె క
ష్టిస్తున్నాం
కష్టాలను మీరు మేము
కంచాలలో చూస్తున్నాం
కావున వదిలేస్తున్నాం
కావడి దించేస్తున్నాం

వస్తున్నాం వస్తున్నాం.

సుఖమంటే మీరెరుగరు
సుంతైనను మేమెరుగము
మాకే తెలియని సుఖముల
మీ కెట్టుల కూర్చగలము ?
అందుకొరకె ముందు మేం
అనుభవించి చూస్తున్నాం
అందులోని మంచి చెడ్డ
లరసి తెలిసికొంటున్నాం
నిజము తెలిసికోవలె నని
నిండా అనుభవిస్తున్నాం
నిలుకడను వహిస్తున్నాం

వస్తున్నాం వస్తున్నాం.

మనకే సుఖములు కావాలో
మాదిరి రుచిచూస్తున్నాం
మా ఎక్స్పరిమెం టొక
మార్గానికి వస్తున్నది
ఇప్పుడిప్పుడె సుఖములలో
ఇంపు తెలియవస్తున్నది
ఇది అంతయు మీకొరకే
ఈ సేవయు మీ సేవయె
మీ ముందలి సుఖంకొరకె
మా ఇందలి సుఖములన్నీ
మీ పిల్లల మీ ఇండ్ల
మీ తల్లుల మేలుగోరి
మా పిల్లల మా ఇండ్ల
మాటగూడ మరచిపోయి
మీ రాహ్వానించిన చోట్లకు
మెదలకుండ వస్తున్నాం
మీ రుంచిన ఛేర్ మీద
మెదలక కూర్చుంటున్నాం
మీ చేతుల దండలన్ని
మెడలనిండ మోస్తున్నాం
మీ చేతుల చప్పట్లకు
మా చెవు లర్పిస్తున్నాం
మిక్కిలి హర్షిస్తున్నాం
మీరు మాకు దొరికితిరని
మిక్కిలి గర్విస్తున్నాం !

మీ రిచ్చే విందులలో
మేము పాలుగొంటున్నాం!
మీ గ్రూపుల ఫోటోలో
మేము నిలిచి చూస్తున్నాం

వస్తున్నాం వస్తున్నాం.

మమ్ము గౌరవించి మీరు
మీ గౌరవ మనుకుంటే
మమ్ములసేవించి మేము
మీ సేవనుకుంటున్నాం
మీకు మాకు వేరున్నదా
మీరు మేము ఒకటేకదా
జొన్నలు బియ్యము గోధుమ
అన్ని మీకే విడుస్తున్నాం
ఒక్క సన్నబియ్యంతో
డొక్కలు నింపేస్తున్నాం
లైటు మీల్సు తీసుకుంటు
లైటువర్కు చేస్తున్నాం
నైట్ స్లీప్ విసర్జించి
రైట్ లెఫ్ట్ చేస్తున్నాం
తిన్నన్నం జీర్ణించక
తినలే కేడుస్తున్నాం
తిరుమంత్రం మరువలేక
తిరుగలేక చస్తున్నాం
మీ సేవే చేస్తున్నాం
మీకై జీవిస్తున్నాం
ముందు జన్మలోన మీకు
ముక్తిని చూపెస్తున్నాం

వస్తున్నాం వస్తున్నాం.

# నీ పేరు

ఆపేరు యీపేరు యేపేరు గాని
నీపేరు పేరుకాని యేపేరుకానను
ఉన్నపేరులతోడ నూరుకొనలేక
పెద్దపేరులకొఱకు పేరసాడెదము ;
పేరుకీర్తుల మాట పెరుమాళ్ళె యెఱుగు
రేపేరు మాపేరు ప్రేమ దలచేరు ?
పేరుకీర్తులు నీవు కోరకుంటినను
వేడుకొని నీకాళ్ళ నీడిగిలబడెను
తమయంతనే వచ్చి తగిలె నీమెడను
నీపేరు కీర్తిని తా పేరుతెచ్చె.

స్వార్థమే మూల మ్మనర్థముల కనుచు
స్వార్థమున కెన్నడో స్వస్తిచెప్పితివి,
దేశమే దివ్య సందేశమై తోప
దేశవాసుల సిరికి దీక్షపూనితివి,
సీమ జూచిన కనుల గ్రామముల గాంచి
ఏమియు నచ్చోట లేమి గుర్తించి
గ్రామవాసుల మొఱకు కరుణ నాలించి
ఇలవేలుపుల మీరు తలక్రిందు సలిపి
పలుబాములను గుడిచి పలపింపవలసె
రాటమె మీకు నారాటమును మాన్పు
కదురు మీ రోగముల కుదురుకొనజేయు
నూలుచే సంపదలు నూలుకొను మీకు

కండెలే మీకు తా పండయై నిలిచి
ఎండిపోయిన మేన కండలను బెంచు
మగ్గములె మీకు కడు లగ్గు కావించు
నేతయే మిమ్ములను నేతవలె కాచు
పడుకుడీ రాట్నమ్ము లుడుకు రక్తముతో
నేయుడీ వస్త్రములు వేయి చేతులతో
సన్నసన్నని యుడుపు లన్నివస్త్రములు
నున్నగా గొరిగి తల సున్నమె పూయు
వాని నన్నిటి మీరు వర్జించి ముందు
దొడ్డుగుడ్డలె కట్ట దొరలౌదు రనుచు
ఉపదేశ మొనరించి యుపకారివైతి.

అన్నమో రామచంద్రా! యని యరచు
నిరుపేదలకు దారి నీవు చూపించు
కాపులే దేశమున కాపులని తెలిపి
రైతుచే యీయుగపు రాజ్య మని యంటి
కలతపడి దేశమును కలియజూచితివి
కలవారి లేనివారలను గాంచితివి
పేదసాదల పిలిచి ఆదరించితివి
కష్టజీవులమీద కనికరించితివి
కట్ట జేనెడు బట్ట కరువైనవారి
పొట్టకూటికి గాసి పొందేటి వారి
అరసి నీ ప్రేమలే తరుగుకానిపోయె
కాంచి నీ కన్నీరు కాలువలుగట్టె.
వర్ణభేదమ్ములే ప్రజల విడదీసి
భేదభావము మదిని పెంచెనని యెంచి

అంటరానిని కాంచి కంట తడిపెట్టి
అస్పృశ్యు లందఱును హరిజనులె యంటి
హరిజనుల సేవయే హరిసేవ యంటి
అనవరా హరిజనుల కభయమ్ము నొసగి
కులభేదములవలన కలుగు నష్టములు
దేశీయు లందఱకు దెలియ రూపించి
కులభేదములు మనకు కూడవని యంటి
వారలును మనవంటివారలని యంటి
కాదన్న వారితో వాదము సలిపి
మెప్పించి యొప్పించి మెల్లమెల్లగను
అత్యవసరములౌ హక్కు లిప్పించి
విద్యాలయములలో వీలు కల్పించి
దేవాలయమ్ములే తెఱపించినావు.
అష్టకష్టములు నీ వనుభవించుచును
అవతార మెత్తితివి అంటు మాపుటకు.

మాతృదేశము నీవ మమత బెంచితివి
భ్రాతృవర్గముకొఱకు బాధ చెందితివి
తల్లి పదములయందు తగిలియున్నట్టి
నిష్ఠురము లైనట్టి నిగళములు గాంచి
నిర్ఘాంతపడి గుండె నీరౌచు పాఱ
కన్నులను చిమ్మచీకటి గ్రమ్ముకొనగ
స్పృహతప్పి పడిపోయి చింతతో లేచి
మాతృచరణములందు మస్తకము నుంచి
రుదియించి రుదియించి రుద్ధకంఠమున
తల్లి దిగులొందకని ధైర్యమ్ము చెప్పి

దాసచేసితి తల్లి పాపములు పట్టి
వీడు నీ దాస్యమ్ము విడిపించువరకు
పట్టు మోపిక యింక పదినాళ్ళపాటు
పట్టుమని తెగియాడు బంధములు మాత్ర !
పలికి బొంకడు కొడుకు పట్టు విడడమ్మా
నిగళములు తెగుదాక నిద్రబోడమ్మా
'దిగ్విజయము' స్తంచు దీవించి పంపు
తల్లిదీవనలె జగ మెల్ల గెలిపించు

అమ్మ దీవన లంది యన్నియును విడిచి
కార్యరంగమునందు గంతువేసితివి
స్వాతంత్ర్యవృక్ష బీజమును నాటితివి
స్వాతంత్ర్యసమర నిస్సాణములు మ్రోగె
గంభీరమగు నీదు గళరావములను
స్వాతంత్ర్యపవన సంచారమ్ము సాగె
గంభీరమగు నీదు సంభాషణముల
చల్లనౌ గుండియలు ఝల్లుమని యూగె
ఉబికెత్తి వచ్చు నీ యుపదేశములకు
పడుచునెత్తురు పొంగి పరువులిడి క్రాగె
భావపూరిత భవదుపన్యాసములకు
బైబిలు ఖురాను లోపలి మర్మములును
ఉపనిషత్తుల రహస్యోపదేశములు
వేదశాస్త్రార్థ సద్విజ్ఞాన సుధను
బుద్ధికలశములోన పూరించి చిలికి
గిలకొట్టి గిలకొట్టి మెలమెల్లగాను
గీతారహస్య నవనీతమ్ము నెత్తి

జాతి కుల భేదముల చర్చలను వీడి
భారతీయులకెల్ల పంచిపెట్టితివి
సభలలోపల శాస్త్రచర్చలను సలిపి
పత్రికలలో నభిప్రాయములు దెలిపి
ఊరూర జ్ఞానసుధ నొల్కించినావు
ఇంటింట విజ్ఞాన మెగజల్లినావు.

బందికానల తపోమందిరము చేసి
దండి జవహరు యోగదండ మొనరించి
నిండు ఆవేదనను పిండు గుండియతో
రెండుకన్నుల నీర్ కమండలము నించి
నిరత సత్యాహింస నిష్ఠలను బూని
నిరశనవ్రతదీక్ష తరచుగా సలిపి
మాలనే నీదు జపమాల గావించి
లక్షోపలక్షలకు మోక్షమ్ము కోరి
స్వాతంత్ర్య స్వారాజ్య సంసిద్ధికొఱకు
" జయ హిందు " అనియేటి జపము జేయుచును
ధరణి నుగ్రంబైన తపసు చేసితివి
సురల మెప్పించి సద్వరము లందితివి
తరముగానట్టి మంత్రమును బడసితివి
ధర్మార్థమోక్ష శాస్త్రముల దెలిసితివి
దారిద్ర్యమును బాపు తంత్ర మెఱిగితివి
స్వాతంత్ర్యసమర శస్త్రముల తెలిసితివి
పరమర్మభేదనోపాయ మెఱిగితివి
రక్తపాతములేని రహదారి కంటి
ఉక్తిమాధుర్యమున ఉల్లముల గొంటి

లక్షల ప్రజల నీ పక్షమున కీడ్చి
పక్షమ్ము నెదురొడ్డి పరులతో బోరి
శాంత్యహింసలె యనెడి శస్త్రముల బూని
శాంతిసమరమునందు జయముగాంచితివి
తల్లిపాదము ముట్టి తాలిచిన ప్రతిన
చెల్లించుకొని సంతసిల్లితివి లోన
దాస్యబంధము లూడ్చి ఆస్యమ్ము తుడిచి
తల్లి యాశీర్వాదతతిని గాంచితివి
పోరకుండనె జరుద్వారములు దెరచి
పారదోలితి రిపుల పరదేశములకు.

నీవు తెలిపెడి రాజనీతి ధర్మములు
నీవు సలిపెడి సంఘ నిత్య సంస్కరణ
నీదు హరిజనసేవ నిరతి గనుగొనియు
" మతధర్మముల రూపుమాపగా నిట్లు
పుట్టె నీ గాంధి " యని తిట్టిపోసేటి
సంఘసంస్కరణమ్ము సరిపడని యట్టి
' పక్కా ' సనాతనుల పలుకు లాలించి
తనకు కుడిభుజమై తనరుదీ వనుచు
తన యుగమ్మునకు వన్నెను గూర్తువనుచు
మోసపడి నిన్ను తల మోసుకొని తిరిగె
నిన్నాళ్లు కలిరాజు ఈనాడు నీదు
నిత్యదీక్షను సహింసా ధర్మరతిని
న్యాయవీక్షణము నన్యాయవిముఖతను
కాంచి నీకలరూపు గ్రహియించి తాను
తటుకునను తననాల్క కటుకుమన గొరికి

"కలియుగమ్మునకు గొడ్డలిపెట్టితండు
మోసపోయితి నరెరె మోసపోయితిని
ధర్మదేవతయె యీ కర్మచంద్రుండు
మర్మమీయక నన్ను మటుమాయచేసె."
వాస్తవమునకు బద్ధవైరివగు తెరిగి
అంత కలిపురుషుడే హంతకుండయ్యె
నిన్ను తనపొట్టలో నింపుకొనెగాక!
నిరతసత్యాహింస నిష్ఠితాత్ముడవు
చేయి నీపై నెవడు చేసికొనగలడు?
నరుడైనవా డెవడు పరిమార్చు నిన్ను?
నరకలోకము చేరి నుఱుకు నెవ్వండు?

ఇక దారితప్పు మమ్మెవ్వ రాపేరు?
ఇక మొఱలు విని శిరము నెవ్వ రూపేరు?
ఇక మా వెతలు పాప నెవ్వ రోపేరు?
ఇక మాకు మనుమార్గ మెవరు చూపేరు?
ఇంక బోధామృతము నెవరు చేపేరు?
ఇంక మాకష్టముల నెవరు జోపేరు?
మహిలోన నికమీద మాకు ప్రాపేరు?
ఇల మాకు గల మచ్చ లెవరు మాపేరు?
మఱి లోకమున నింక మాకు బాపేరు?
ఎదలోని గాయమిం కెవరు మాన్పేరు?
శాంతినిద్రనుండి ని న్నెవరు లేపేరు?

నరము లేనట్టి మా నాలుకలు భువిని
చాటించు నీ పేరు శాసనము లగుచు

మఱపరానట్టి హృత్ఫలకముల మీద
నీరూపు చిత్రించి నిలిపియుంచెదము
కారిపోనట్టి మా జ్ఞానకలశముల
నీదు బోధామృతము నిలువచేసెదము
ఏడేడు జన్మమ్ము లెత్తి తీర్చినను
తీరిపోనట్టి నీ భారమౌ ఋణము
నీ దివ్యబోధముల నిష్ఠతో సలిపి
ఓపినంతకు మేము పాపుకొనియెదము
భవదాత్మశాంతికై పంచిపెట్టెదము
దివ్యసందేశముల దేశదేశముల.

నీ యాత్మశక్తియే నిశ్చలంబయిన
కార్యదీక్ష నొసంగి కాపాడు మమ్ము
తెలివి మా కొసగి భువి నిలుపుగావుతను
నీ యాత్మశక్తి సన్నిహితమై మమ్ము
ప్రియమాతృసేవకై ప్రేరేచుగాత ।
నీ యాత్మ స్వర్గధౌరేయమై సతము
హావణిల్లుగావుత మహాత్మ గాంధీజీ ।

# కాలచక్రం

కాలచక్రములోని
కీలునొక్కె నెవండొ!
ఉబ్బూతలూగి యిటు
గిఱ్ఱుమని తిరిగింది.

మ్రొక్కబోయిన కేలు
చిక్కబట్టి బిరాన
త్రొక్క లేపిన కాలు
తొంటిలో విరిగింది.

ఇంటికుక్కని కండ
లెదురిచ్చి పోషింప
వెఱ్ఱెత్తి ఏనుగుల
వెంటబడి మొఱిగింది,

వాత లంటించుకొని
వనరాజు ననుకొన్న
వఱదు బోనున చిక్కి
వక్కివక్కి వరిగింది.

మెల్లమెల్లగ పెరిగి
మేరువైన ఖజాన
కళ్లు తెరిచేసరికి
కరిగి తరిగింది.

హాలాహలపు చవుల
నవనికో చూపింప
ముసలిత్రాచుకు పంటి
విసము విరిగింది.

ఆకాశ మండలము
నంట పెరిగిన తరువు
మూలముట్టుగ నేడు
నేల కొరిగింది,

# ఐకమత్యము

సూర్యు డొక్కడు చంద్రు డొక్కడు
సురుచిర జ్యోతిస్స్వరూపులు
చుక్క లన్నీ ఒక్కటైతే
సూర్యచంద్రుల మించవా!

కలియపేనిన తృణగణమ్ముల
కట్టవచ్చును గంధగజముల
విడివిడిగ పడియున్న తృణముల
పిల్లగాలి హరింపదా!

వానచినుకులు ఒక్కటొకటిగ
వస్త్రములనే నాన్పజాలవు
అట్టి జలశీకర పరంపర
లంబుధుల నిర్మింపవా!

అక్షరమ్ములు వేని కవియై
అర్థహీనములయి లయించును
అక్షరక్రమసంగతిఁ మహా
దక్షరసమయ కావ్యమౌ!

# సూక్తులు

ఆడ మగ భేదములు రెండే
ఆదిలో సృష్టింపబడగా
మధ్యలో కల్పితమతమ్ములు
మానవుల విడదీసెగా.

పేదసాదల జూచి లోకము
భేదములు పాటించి నవ్వును
జాతిమతభేదములు ధనికుల
జాతకములం దుండవు !

జాతిమతభేదములు మనుజుల
ఘాతుకపు మృగముల నొనర్చెను
రోతపనులను సలిపి దేవుని
మాతలము మేమందురు !

దేవు డనుమను దయ్య మనుమను
దేవులాడిన లాభమున్నదె?
లోకమే పరమాత్మ తత్త్వము
లోకు లాతని అంశముల్.

అమరులకు అసురులకు సమరము
అహరహము కొనసాగుచుండును
ధనపిశాచులు దానవులు, ని
ర్ధనులు కృషికులె దేవతల్.

మత మనంగా మనుజునకు దే
వతకు గల సంబంధమును, త
ద్గతి యుపాయము దెలుపు; మఱిన
న్మతము పరసుఖసాధనమ్.

మత మనగ, సంఘమ్మనంగ, స
మాజమన, శాసన మనంగా
సతతమును మనుజులకు నిహసుఖ
సాధనములై హితములౌ!

కట్టు బొట్టు జుట్టు లందే
కానబడు భేదమ్ము; నీతికి
కట్టుబడి జీవించు చుండిన
కారె అందఱు మానవుల్?

లోకమంతయు శోకహతమై
చీకి చివికి కృశించుచున్నది
ఘూకశోకము రోదసుల కెగ
బ్రాకుచున్నది పట్టపగలె.

లోకమంతయు పేరుకీర్తుల
తోకపట్టుక ఈదుచున్నది
ఆల తోలి తటాకముల శృం
గాల బేరా లాడుచున్నది.

చెట్టలన్నియు చేరిచేరి
కట్టతెగి ప్రవహించుచున్నవి,

చెట్ట గట్టిగ పట్టుకో, నను
కొట్టుకొని పోనీకు తండ్రీ!

నీదు చల్లని చరణఛాయా
నిబిడమౌ పందిళ్ళక్రిందను
నిర్మమాహంకారి నై నను
నిలువనీ తండ్రి!

లిబ్బిరాయని చుట్టు లోకము
ఉబ్బి పబ్బతిపట్టి తిరుగును
గోచిరాయని జూచి బిరబిర
లేచి తలుపులు మూయును.

నాల్గుదినముల ముందు పుట్టిన
నాగరాజే పెద్దయౌనట
నాల్గునాళుల వెనుక పుట్టిన
నరుడె చిన్నట అన్నిటన్.

పుట్టువులలో ముందువెనుకల
పట్టి యోగ్యత లుట్టిపడునా?
పుట్టవే శ్రవణములు మును, వెను
పుట్టవా కొమ్ముల్?

స్వీయలాభము కోరి మేరువు
మోయునేనియు ఘనమగునె? పర
కీయమునకౌ తృణమయిన స్తవ
నీయమై చరితార్థమౌ!

ఒంటిగా కూర్చుండి జుర్రిన
జుంటితేనియ విషసమానము
అంబలియె పదిమందిలో నమృ
తాంబువుల తుల్యంబవున్.

భోగమెంతయు రుచ్యమై బహు
రోగములకే హేతువౌ భువి
త్యాగ మెంతయు నేష్టమై చతు
రాగమాంతస్తూయమౌ!

త్యాగ మెఱుగని వాడు కేవల
భోగముల పొరలాడువాడు న
జాగళస్తనముల విధమ్మున
ఊగి మరణించున్.

కాకపది చిరజీవి యయ్యును
లోకమున మెప్పొందగలిగెనె?
కోకిలమ్మ వసంతవధువై
లోకమును రంజింపదా?

తమతమ స్థానముల వీడుచు
పరుల పదవికి ప్రాకులాడిన
మేక మెడచన్నుల విధమ్మున
లోకమున నపహాసితుడౌ!

మంచివారల దాటి ముందుగ
మించి నిలిచిన వంచకుడు, రా

ణించజాల డజాగళ స్తన
నియతి లోకమునన్.

కాలిబాటయొ గాలిబాటయొ
రైలుమార్గమొ రాజ-మార్గమొ
కాలుకదపుచు నుండ నన్నియు
గమ్యమునకే చేర్చుగా.

స్వార్థునకు లోకమున కేవల
మర్థ మొక్కఁడె బంధువగును, త
దర్థ సాధనమే సకల పురు
షార్థసాధన మతనికౌ.

# పాననిషేధము

తాగబోకుర తమ్మి కల్లు, నువ్వు
తాగబోకుర అన్న కల్లు, దాని
తస్సగొయ్యా ! కల్లు
తాగకుంటే శెల్లు

తాగకుర ఓతమ్మి కల్లు, నీవు
తాగకుర ఓఅన్న కల్లు, నీవు.

కల్లు తెగతాగుతే
ఒల్లు బిగిసెడిపోవు
శిల్లిగవ్వకుకూడ
శెల్లకుం డయితావు

తాగకుర.

గంజి లేకుంటేమి ?
కల్లుంటె సాలుపో
నరగ లోకం కండ్ల
తిరుగుతా దంటావు

తాగకుర.

తెల్లనీళ్ళకే కండ్లు
తెరశి సూశేవు
సారసీసా సూత్తె
సంక లెగరేశేవు

తాగకుర.

పొద్దాక శేసిన
పూటకూ ల్లేమాయె
పొద్దాకి సుట్టలకు
పొవ్వాకె కరువాయె

తాగకుర.

ఉడుకుగంజిల కింత
ఉప్పురాయే లేదు
లొట్టివానన సూశి
లొట్కాలేశేవు

తాగకుర.

పిల్లజెల్లా యింట్ల
తెల్లపొయి వస్తుంటె
కల్లుదాగి నువ్వు
కతకతా సేస్తుంటె
గొల్లుమని యింటదీ
లొల్లి కెత్తాకుంటె
తల్లి నక్కాను తిట్టి
తంచనా లాడేవు

తాగకుర.

# మామ

మా మామ వచ్చిండు
మా కేమొ తెచ్చిండు
మంచి ముత్యా లివే
పంచుకొం డన్నాడు.

బొండుమల్లెలు కొంగు
నిండ వెద చల్లిండు
దండ లల్లిన యల్లు
కొండు మీ రన్నాడు !

పచ్చిపాల్ తెచ్చిండు
పారనే పోసిండు
ఎత్తుకోగలరేని
యెత్తుకొం డన్నాడు !

అమృతభాండము తెచ్చి
అటుకుపై-నుంచిండు
అందుకో గలరేని
అడ్డ మెవరన్నాడు.

పలుగురా కొండెక్కి-
పగులబడి నవ్విండు
పట్టుకో గలరేని
పట్టుకొం డన్నాడు.

దొరవోలె వస్తాడు
దొంగవలె పోతాడు
కనుమూసి తెఱచులో
కనపడడు మా మామ.

ఎంచిచూడగ చాల
మంచివా డాతండు
చల్లదనముల పుట్టి
నిల్లు తా మా మామ !

దొడ్డ గుణముల వాడు
దొరతనము కలవాడు
నలుపెల్ల దిగమింగి
తెలుపులే వెదజల్లు !

మా మామ కడుపులో
మచ్చ కనుపిస్తుంది
లోకోపకారమై
చీకట్లు మింగించా !

మామలకు మామ తా
మా చందమామ !
మామమామకు మఱది
మా చందమామ !

# తప్పొప్పుల పట్టిక

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 4 | 2 | 3 | నిను | నినున్ |
| 9 | 2 | 3 | పాళి= | జాళిన్ |
| 10 | 3 | | మీ యంద | నీ యంద |
| 20 | 3 | 1 | అతడు పాలించె | ఆత డుపాసించె |
| ,, | ,, | 5 | తలగలడు | తలగలాడు |
| 22 | 1 | 3 | లౌను | లైన |
| 29 | 4 | 1 | ముటిన | ముట్టిన |
| ,, | 4 | 3 | కైశికిన్ | వేణికన్ |
| 31 | | 2 | జారిపోయి | జారిపోమి |
| ,, | 2 | 1 | మెల్ల మెల్లగ | మెల్ల మెల్లగ |
| 32 | 1 | 7 | వెలుంగ | మెలంగ |
| ,, | 2 | 5 | అగును నయ్యవె | అగును సుమ్మవి |
| 37 | 3 | 2 | గడించి | గడించు |
| 40 | 1 | 3 | కమ్మలుచాటి | కమ్మలదాటి |
| 42 | 3 | 1 | యిట్లు | నిట్లు |
| 45 | 3 | 4 | కిహములు | కిహమును |
| 46 | 2 | 1 | కుంమ బొట్టు | కుంకుమ బొట్టు |
| 51 | 2 | 3 | పంచమశ్రృతిని | పంచమశ్రుతిని |
| 57 | 2 | 2 | కుండలో | కుండతో |
| 58 | 3 | 1 | యిటు | యటు |
| 59 | 4 | 19 | హరుసిక వోలె | హంసిక వోలె |
| ,, | ,, | 22 | యిసుకపాన్పుల బవళించె | యిసుకపాన్పున బవ్వళించె |
| 62 | 4 | 3 | భ్రమర రాజులు | భ్రమర రాజము |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 63 | 3 | 4 | జూడ లేనేలేవు | జాడ లేనేలేవు |
| 67 | 2 | 6 | పోకలే పోయె | పోకలనె పోయె |
| ,, | ,, | 7 | నేగి | నేగె |
| 68 | 2 | 2 | నెల్ల | నల్ల |
| 69 | 3 | 5 | యన్నమా | యన్నమౌ |
| ,, | ,, | 7 | బేరమా | బేరమౌ |
| 71 | - | 2 | హాబ్ధి | హావార్ధి |
| 72 | 1 | 3 | తెల్లము గాక | తెల్లము గాగ |
| 74 | 1 | 2 | దుఃఖమావుచు | దుఃఖపోవుచు |
| 79 | 3 | 2 | కరవాలగముల | కరవాలముల |
| 80 | 1 | 2 | బ్రహ్మణ | బ్రహ్మన |
| 87 | 2 | 1 | వస్తున్నాం | పస్తున్నాం |
| ,, | 3 | 5 | మేం | మేము |
| 88 | - | 9 | ముందలి | ముందరి |
| 89 | 2 | 8 | అన్ని | లన్ని |
| ,, | ,, | 12 | లైటువర్కు | హైటువర్కు |
| ,, | ,, | 21 | జన్నలోన | జన్మలోన |
| 90 | 1 | 10 | కీర్తని | కీర్తికిని |
| ,, | 2 | 6 | ఏమియు | ఏమియును |
| 91 | 2 | 2 | చూపించు | చూపించి |
| 92 | 1 | 9 | వాదము | వాదములు |
| 93 | 1 | 4 | తెగియాడు | తెగియూడు |
| 98 | 4 | 4 | వక్కివక్కి | వక్కి |
| 100 | 4 | 4 | దష్టరసమయ | దర్ధరసమయ |